ప్రతి మగువా మనసుపడుతుంది
ప్రతి చూపూ వెంటబడుతుంది
రాజ్‌కమల్ చీరల రహస్యం అది

*R. Jaya Prada*

# రాజ్‌కమల్

## కాటన్ ప్రింటెడ్ చీరలు







మీ ప్రియమైన సినీతార "జయప్రద" రాజ్‌కమల్ " చీరలో

Manufacturers
SHREE SITARAM DYIENG & PRINTING
MILLS (P) LTD. BOMBAY - 2



## సీరియల్స్

''జీవిత సమరం'' మొదటి నుండి ఆసక్తికరంగా సాగుతు చివరకు ముగింపుకూడా ఆసక్తిదాయకంగా నున్నది. రచయిత్రి యర్రగుంట్ల వరలక్ష్మీదేవిగారు ఈ నవలలో నీరజ పాత్రను తీర్చిదిద్దిన తీరు చాల బాగుంది. నేటి సామాజిక వ్యవస్థలో స్త్రీల స్థితిగతులగురించి చాల బాగా వివరించారు. నవల చదువుతుంటే అందులోని పాత్రలు, సన్నివేశాలు మాకు కన్నులకు కట్టినట్లున్నాయి.

''అందానికి అవతలివైపు'' సీరియల్ నవల ఆసక్తికరంగా సాగుచున్నది.

''రేపటి ఉదయం'' సీరియల్ నవల మొదటిలోనే ఆకట్టుకుంది. రంగనాథం మేష్టారిగారి పాత్ర చాల సహజంగాను, విలక్షణంగాను ఉన్నది.

ఎస్. ఎస్. నిశిధిని, ఇతరులు (నంద్యాల)

## రైళ్ళల్లో మోసాలు !

ఈ మధ్య పత్రికలో ప్రచురించబడిన ''చేపల చెరువు'' కథ చదివి ఈ ఉత్తరం వ్రాస్తున్నాను.

ఈ బట్టల వేలంపాట విజయవాడ, తిరుపతి మధ్య ఎక్కువగా రైలు ప్రయాణం చేసేవారికి చిర పరిచితమే. పాడితే ఎందుకూ పనికిరాని ఆ బట్ట మీ పరమౌతుంది.

ఈ మధ్య మొదలైన మరొకరకం మోసం — ''అయ్యా నేను మద్రాసు పోవాలండి — పర్సు ఎవరో కొట్టేశారు. గుంటూరులో కొన్న బట్టల జత ఉన్నది. సగం ధరకి లేకపోతే మద్రాసుకు రైలు చార్జీలు ఇప్పించి ఈ ప్యాంటుపీసు, షర్టుపీసు తీసుకోండి — కావాలంటే గుంటూర్లోకొన్న షాపు బిల్లు చూడండిసార్'' నమ్మారా—ఇంతే సంగతులు.

ఎ. సత్యనారాయణ (కలకత్తా)



## న్యూఢిల్లీ లేఖ

15-4-83 సంచికలో జయదుబాషిగారు వ్యాసములో ఆర్థిక, రాజనీతి శాస్త్రములు అసలు శాస్త్రములే కాదని, వాటినిగూర్చి పరిశోధన అనవసరమని వ్రాసినారు. మానవ ప్రవర్తన ఒక నిర్దిష్టమైన రీతిలో వుండదు కనుక ఆ శాస్త్రములపై ఒక పరిశోధన అనవసరమని ఆయన అభిప్రాయమా ? కానీ మానవులలో అధికుల ప్రవర్తన అభిప్రాయాలు దాదాపు ఒకే ఆలోచనాపరిధిలో వుండును. అందుచేత ఆర్థిక, రాజనీతి శాస్త్రాలుకూడా ఒక శాస్త్ర పరిజ్ఞానాన్ని తెల్పేవే కనుక వాటిని శాస్త్రాలు కాదనుట హాస్యాస్పదము. అలాగే కారల్‌మార్క్స్, కీన్స్ సిద్ధాంతాలను ఆయన విమర్శించుట సమంజసముగా లేదు.

జి. రాజేంద్రప్రసాద్ (గుడివాడ)

## ముగింపు బాగుంది

''జీవిత సమరం'' ముగింపు చాల బాగుంది. ముగింపు మేము ఊహించని రీతిలో వుంది. నిత్య జీవితంలో మోహన్‌రావు, సుబ్బాయమ్మలాంటి తల్లి, కొడుకులు ఈ సమాజములో చాలమంది ఉన్నారు. అలాంటివారికి కనువిప్పు కాగలదు. నీరజ పాత్రను తీర్చిదిద్దిన తీరు చాల బాగుంది.

కె. పి. రామసుబ్బయ్య (మైదుకూరు) ★

పై వారమే ప్రారంభం!
కొత్త సీరియల్
# ఇది మేఘసందేశమూ...
రచన :
పక్కలంక పద్మావతి

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు :
[1938–1972]
శుక్రవారం : 20–5–'83
రుధిరోద్గారి నామ సం. వైశాఖ శు. అష్టమి
సంపుటము 75 సంచిక 38
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

| | | |
|---|---|---|
| విడి ప్రతి వెల | రు. | 1-50 |
| ఆరు మాసాల చందా | రు. | 42-90 |
| పోస్టులో ఏడాది చందా | రు. | 85 80 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,
గాంధీనగరం. విజయవాడ-520 003.


## విషయానుక్రమణిక

ముఖచిత్రం :
'సాగర సంగమం'లో జయప్రద



## లోకంపోకడ : టీమెన్

















# సామాన్యజనం సమస్యలు ఎవరికి తెలుస్తాయి?




సమాజానికి శాసనకర్తలు కవులు అయితే (ఈ మాట అన్నది కీట్స్ లేదా షెల్లీ కదూ ?) సమాజంయొక్క అంతరాత్మని సంరక్షించేవాళ్ళ కార్టూనిస్టులు లేదా హాస్యచిత్రకారులు అనుకుంటూ ఉంటాను. ఒక మంచి కార్టూనిస్టు వెయ్యిమంది సంపాదకీయ రచయితలకి సమానం, ఒక మంచి కార్టూను వెయ్యి గర్జించే సంపాదకీయాలతో సమానం. ఈ మధ్యనే 'రోహిణి' అంతరిక్షంలోకి వెళ్లినప్పుడు శాస్త్రజ్ఞులనీ, ప్రభుత్వాన్నీ పొగడుతూ కొందరు సంపాదకీయాలు రాయనేరాశారు. కాని, కార్టూనిస్టులు అంత మెచ్చుకోలు చూపలేదు. టయిమ్స్ ఆఫ్ ఇండియా పత్రికలో లక్ష్మన్ వేసిన కార్టూన్‌లో శ్రీమతి గాంధీ చిరిగిపోయిన బట్టలు వేసుకున్న ఇద్దరితో "తరువాతి అంతరిక్ష నౌక ఇంకా అద్భుతంగా ఉంటుంది, బీద రైతులకి సాయం చేస్తుంది" అంటూ ఉంటారు. ఆ బొమ్మలో ఒక మోడయిన చెట్టు ఉంటుంది. దానిమీద రెండు రాబందులుకాసుకుకూర్చునిఉంటాయి. 'స్టేట్స్‌మెన్' పత్రికలో కార్టూన్‌లు వేసే విజయన్ కొంచెం ఘాటుగానే వేస్తూ ఉంటాడు. రోహిణిమీద ఆయన వేసిన హాస్య చిత్రంలో ఒక గీత ఉంటుంది. ఇది 'పేదరికపు ఎల్ల' అన్న మాట ఈ దారిద్ర్యరేఖకింద భారతీయులు ఎందరో ఉంటే దానిపయిన అంతరిక్షమూ, సాంకేతిక విజ్ఞానమూ ఉంటాయని విజయన్ వ్యాఖ్యచేశాడు.

ప్రభుత్వంవారు గొప్ప విజయం సాధించామనుకున్నప్పుడే ఇందరికి మనదేశం ఇంత బీదదన్న విషయం గుర్తుకివస్తుందెందుకు? ఆసియాడ్ జరిగినప్పుడూ ఇంతే, త. దే. స. జరిగినప్పుడూ ఇంతే అయింది ఎందుకు? ఆసియాడ్ ఏర్పాటులు మన సామర్థ్యానికి నిదర్శనంట. త. దే. స. శ్రీమతి గాంధీ గొప్పతనానికి నిదర్శనంట — కనీసం తాగిన మైకంలో ఉన్న పత్రికారచయితలు అందరు ఇలాగ రాశారు. ఆవిడని నెపోలియన్‌తో, అలెగ్జాండర్‌తో, సీజర్‌తో పోల్చారు వాళ్ళు. కార్టూనిస్టులు ఇలాంటి మైకంలో పడలేదు. నిదానంగా ఆలోచించి వారు బొమ్మలు గీశారు. గుడిసెలలో బీదల సంగతికూడా చూడాలి. కేవలం దిగుమతి ఆయిన దీపాలవెలుగులోని మెరుపు కాదని వాళ్ళు సూచించారు. ఇది నిజమేకదా? భారతదేశంలో ఎక్కువగా కనపడేది ఆకాశంలోని అంతరిక్షనావ కాదు. గుడిసె పక్కన రొచ్చుగుంట. ఇది ఇక్కడి యదార్థం.

అసలు యదార్థం ఏమిటంటే, మనలో ఎంతో మంది ఒకతరం ముందు బీదగానే బతికేవాళ్లము. కొందరి పేదరికం ఎక్కువ అయితే మరి కొందరిది తక్కువ—అంతే తేడా. లక్ష్మన్, విజయన్‌లు ఇద్దరూ దక్షిణాది వాళ్ళు. ఇప్పుడు వాళ్ళ సంపద ఏమాత్రమో నాకు తెలీదు కాని వాళ్ళని "మీ చిన్నప్పటి పరిస్థితులు ఎలాగ ఉండేవి?" అని అడిగితే "ఒక మోస్తరుగానే ఉండే"వనో లేకపోతే "గడ్డుగానే ఉండే"వనో సమాధానం వస్తుందనే నేననుకుంటాను. [ఒకనాటి మదరాసు, తిరువాంకూరు రాష్ట్రాల వాళ్ళు కదూ వీళ్ళిద్దరూ?] ఈ మధ్యనే నేను ఒక సంపన్నుడితో కాసేపు బాతాఖానీ వేశాను. ఆయన ఆస్తి తేలికగా యాభయి, అరవయి లక్షలు ఉంటుంది. అరేబియా మహా సముద్రం కనిపిస్తుంది ఆయన "ఫ్లాట్"లో కూర్చుంటే. నాతో ఆయన చెప్పింది తన ఐశ్వర్యాన్ని గురించి కాదు నలభయి సంవత్సరాల కింద బొంబాయిలో తను "నాకు భోజనం పెట్టేది ఎవరు?" అని ఎలాగ ఆలోచించేవాడో దానిని గురించి చెప్తాడు. ఆయనకి తన ఆస్తులన్నీ—కారులూ, ఇళ్ళూ, విదేశయాత్రలూ ఇవేవీ — నిజం కావు. ఆయనకి నిజంగా తోచింది ఒకనాటి తన ఆకలి.

భారతదేశానికి నెహ్రూ బదులు లాల్‌బహదూర్ ప్రధానిగా ఉంటే పరిస్థితులే వేరుగా ఉండేవని నేననుకుంటూ ఉంటాను. పెద్దపదవిలో ఉండేవాడు మనలాగే కష్టాలు పడినవాళ్ళ ఉంటే అదొక రకం. నెహ్రూ అగర్భ శ్రీమంతుడు, అది ఆయనకీ తెలుసు. శ్రీమతి గాంధి సంగతి సరేసరి. నెహ్రూకి అందిన మొదటి జీతం ఒక ప్రధానమంత్రికి వచ్చే జీతం. అంతకి ముందు ఆయన ఎప్పుడయినా ఏదయినా ఉద్యోగం చేశాడా? తన ఉపాధికి కృషి చేశాడా? [అంటే సామాన్యులలాగ.] అలాంటి వ్యక్తి ఇతరులని పాలించటం మంచిది కాదు. నెపోలియన్ ఒక కార్పొరల్‌గా చేశాడు సైన్యంలో. హిట్లర్ కూడా అంతే. వాళ్ళ జీవితంలో నెగ్గారా, ఓడిపోయారా అన్నది కాదు ముఖ్యం — వాళ్ళకి తమ జీవితాలలో ఎప్పుడు విజయం లభించిందో, ఎప్పుడు లభించలేదో తెలుసు. ఒక మనిషికి గెలుపు, ఓటమిల సంగతి బజారులో కాకుండా ఏవో సిద్ధాంతాల ద్వారా మాత్రమే తెలిస్తే ఆ మనిషి ఏపాటి నాయకుడు కాగలడు? నెహ్రూ తన జీవితంలో ఓడిపోయాగు— దానికి ఒక కారణాన్నయినా నేను చెప్పగలను. అదేమిటంటే, ఆయన జనసామాన్యంతో సంబంధం లేకుండా జీవించేవాడు. జన సామాన్యం అంటే మీరూ, నేనూ, ఇంకా ఎందరో. ఆయన ప్రపంచం వేరు. మన ప్రపంచం వేరు.

మళ్ళీ గాంధీమహాత్ముడిని తెరమీద చూశాను. బొంబాయిలో అట్టెన్‌బరో తీసిన సినిమాని నాలుగవసారి చూసాను. గాంధి మీలాంటి, నాలాంటి సాదా మనిషి. ఆయనది ఈ గడ్డ. ఆయన తన మేకతో ఎలాగ మాటలాడేవాడో అలాగే వైస్‌రాయ్‌తోనూ మాటలాడేవాడు. జిన్నాతో మాటలాడినప్పుడు మాత్రం గాంధీ గొంతుక మారేది. ఎందుకంటే, జిన్నా ఒక యంత్రం వంటి మనిషి. గాంధీకి యంత్రాలంటే ఇష్టం లేనేలేదు. నెహ్రూ ప్రధానమంత్రి కాగానే ధోవతి వేసుకోవటం మానేస్తాడు ఈ సినిమాలో. అసలు ఆయన భారతీయ వస్త్రాలవి వేసుకునేది చిత్రం చివరిభాగంలోనే. ఎందుకు? గాంధీ కాలంలో ధోవతి వేసుకోవటం, ఒక వేషం మాత్రమేనా? ఏమో నాకు తెలీదు. నేను చివరిసారి నెహ్రూని చూసినప్పుడు ఆయన ఒక చక్కటి దంతం గొట్టంతో సిగరెట్ పెట్టి కాలుస్తున్నాడు. అసలు నెహ్రూ పద్ధతి ఇదేనా? లేకపోతే ఇదీ ఒక వేషమేనా? ఏమో!

నాయకులు జనసామాన్యనికి చెందిన వాళ్ళగానే ఉండాలని ఒక వాదం. ఇది తోసివెయ్య తగిన వాదం కాదు. మార్గరెట్‌థాచెర్‌ని తీసుకోండి. ఆవిడ తండ్రి ఒక కిరాణాకొట్టు నడిపేవాడు. ఆవిడ బాగా చదువుకుని, స్కాలర్‌షిప్పులు సంపాదించుకుని ఐ. సి. ఐ. అనే పెద్ద సంస్థలో పరిశోధకురాలి ఉద్యోగం తెచ్చుకుంది. ఆ తరువాత లాయరు వృత్తి తీసుకుంది. ఇలాంటి పనులు చేసేది మీలాంటి వాళ్ళూ, నాలాంటి వాళ్ళూనే కదా? ఆవిడ విధానాలు అంత విజయవంతంగా లేవని అంగీకరించాలనుకోండి! [కొందరేమో ఆవిడ విధానాలు బ్రిటన్‌ని నాశనం చేస్తున్నాయంటారు.] అయినా మైకేల్‌ఫుట్ అనే విదూషకుడి కన్నా ఈమె విధానాలే నయం కదా? [ఈ పెద్ద మనిషే అత్యవసర పరిస్థితి విధించినందుకు శ్రీమతి గాంధీని అభినందించిన మహాశయుడు. తను సోషలిస్టునని చెప్పుకునే ఈయన బ్రిటన్‌లో ఎమర్జన్సీ విధిస్తే శ్రీమతి థాచెర్‌తో తప్పకుండా యుద్ధం చేసేవాడే.] బ్రిటన్‌లో స్వేచ్ఛ ఉంది. అటువంటి దేశానికి నాయకుడుగా ఉండతగునా ఈ సోషలిస్టు కబురులుచెప్పే మహనీయుడు? ఆయనకి ప్రజాస్వామ్యానికీ, నియంతృత్వానికీ మధ్య తేడా తెలీదు కదా? అందుకనే లేబర్ పార్టీలో ఆయన పేరు కాస్త పడిపోయింది. రోహిణి ప్రయోగం సందర్భంలో శ్రీ ఫుట్ ఒక అభినందన సందేశం పంపాడేమో శ్రీమతి గాంధీకి. ఆ అభినందన సందేశం చివరికి దానిని పంపిన పెద్దమనిషిలాగే చెత్త కాగితాల బుట్టలోకే వెడుతుంది. ★

ది
న
ఆంధ్రపత్రికలో
త్రి
క

★ నవ వివాహాలు
★ దినవారఫలాలు
★ ఇది వారి దృక్పథం

★ డాక్టరు కబుర్లు
★ వల్లెసీమ
★ యుద్ధకాండ

★ కలైడోస్కోపు కార్టూన్
★ శ్రీకృష్ణభాగవతం
★ వింత యథార్థం

★ ఇంకా — వ్యాసాలు,

గేయాలు, కార్టూన్లు ....

ఎప్పటికప్పుడు ఆంధ్రపత్రికలో

సరికొత్త ఆకర్షణలు

ప్రవేశపెడుతూనే ఉంటాము!

వెంటనే ఆంధ్రపత్రిక

చందాదారుగా చేరండి!

* * *

# వివాహ వేదిక

## (ప్రకటనదారులకు క్రొత్త అవకాశం)

రోజు రోజుకు సాంఘిక వ్యవస్థ, వివాహ తీరుతెన్నులు మారుతున్నవి. మారుతున్న ధోరణులకనుగుణంగా వివాహ సంబంధాల గూర్చి తగు సమాచారము సేకరించుటలో క్లిష్టత, త్రిప్పట, వ్యయం అధికమవుతున్నవి.

వధూవరుల కొరకు సమాచారము పత్రిక ద్వారా అందజేసుకోవడం వల్ల కొంత ఈ సమస్యకు పరిష్కారము కాగలదు. ఈ దృష్టితోనే ఆంధ్రపత్రిక (దినపత్రిక)లో వధూవరులను గూర్చిన ఒక ప్రకటనల వేదికను ప్రచురించదలచినాము. మామూలుగా అయ్యే చార్జీలపై 50% రాయితీతో అంటే మామూలు సంగ్రహ ప్రకటనలకు లైనుకు రూ.6లు చార్జీకి బదులు ఈ ప్రత్యేక కాలంలో లైనుకు రు 3-00 వంతున చార్జీ వుంటుంది. (లైనులో సుమారు 15-16 అక్షరములు ఇమడగలవు) నాలుగు లైన్లకు తక్కువ లేకుండా ప్రకటన వుండాలి.

మీ ప్రకటన విషయము + చార్జీలను మనిఆర్డరు/డ్రాఫ్టు ద్వారా జతపరచి (బాక్సు నెంబరు కోరేవారు అదనంగా రూ.5లు చెల్లించాలి)

**ఆంధ్రపత్రిక**
గాంధీనగరం, విజయవాడ-3
లేదా
బషీర్ బాగ్, హైదరాబాద్-29కు
పంపవచ్చును.





# అతడు అడవిని జయించాడు

డా. కేశవరెడ్డి

మునలివాడు పురాతనమైన శిలవలె పడుకుని ఉన్నాడు.

సాయంకాలపు ఎండ తెరచిఉన్న తలుపుగుండా వచ్చి అతని పాదాల మీద పడుతున్నది.

అతని పాదాలు చేటలవలె విశాలంగాను, బండలవలె మొరటుగాను ఉన్నాయి. ఆ పాదాలు అక్కడక్కడ పగిలి ఉన్నాయి.

కొన్ని పగుళ్ళలో గులకరాళ్లు చిక్కుకుని ఉన్నాయి. అతడు మోచేతిని తలగడగా చేసుకుని నిద్రిస్తున్నాడు. సూర్యుడస్తమించనున్న ఈ వేళగాని వేళలో అతడు నిద్రించడం చాల అరుదు.

## అతడు అడవిని జయించాడు

కాని ఈ దినం తెల్లవారి నిద్రలేచింది మొదలు అతనికి శరీరంలో నలతగా ఉంది. సన్నగా జ్వరం కాస్తూంది. కళ్ళన్నీ పోట్లు పెడుతున్నాయి. ఆ కారణంగా అతడు దినమంతా ఇంటిపట్టునే ఉన్నాడు. వేళగాని వేళలో భోంచేస్తున్నాడు. వేళ గాని వేళలో నిద్రిస్తున్నాడు. పాపం. ముసలితనంతో బాటు అస్వస్థత తోడురాగా అతని నిత్యకృత్యాలు క్రమం తప్పాయి.

అతడు నిద్రిస్తున్న గుడిసె బయట పందుల దొడ్లు రెండున్నాయి. ఒక దొడ్లో నుక్కపంది తన పిల్లలను పక్కన వేసుకుని పడుకుని ఉంది. అది తన నాలుగు కాళ్లను బార్ల జాపుకుని, మోరను నేలపైన పడవేసుకుని అరమోడ్పు కన్నులతో ఆనందాతిశయాన్ని అనుభవిస్తూ ఉంది. పిల్లలు తల్లి రొమ్ములను కుమ్ముతూ పాలు తాగుతున్నాయి. పిల్లలు మరీ మోటుగా కుమ్మినప్పుడు తల్లిపంది మెత్తగా హాయిగా మూలుగుతున్నది. పన్నెండు పలుగులకుతానిప్పుడు తల్లిననే గర్వము, సంతోషము, తృప్తి దాని అరమోడ్పు కన్నుల్లో కనిపిస్తున్నది.

రెండవ దొడ్డి ఖాళీగా ఉంది. అందులో వున్న పందుల్ను ముసలివాని మనుమడు మేతకై తోలుకొని పోయి ఉన్నాడు. ఈ పూట తాను అస్వస్థతగా ఉన్నందువల్ల ముసలివాడు పందులను మేపుకునివచ్చే బాధ్యతను తన మనుమునికి అప్పగించాడు.

ముసలివానికి మెలకువ వచ్చింది. ముడుచుకుని ఉండిన కాళ్ళను, చేతులను, మెడను చాచాడు. అతని కదలిక కొండచిలువ చుట్టగా చుట్టుకుని ఉండి ఎక్కడికో బయలుదేరుతున్నట్లున్నది. గోచెను బిగించి కట్టుకుంటూ అతడు లేచి నిల్చున్నాడు. లేస్తున్నప్పుడు అరచేతులను మొదట నేలపైనను ఆ తరువాత మోకాళ్ళపైన ఊనుకుని లేచాడు. అతడలా లేస్తుండగా అతని మోకాళ్ళు, నడుము, వెన్నుపూసలు పటపటమని చప్పుడు చేశాయి.

అతను ఆజానుబాహుడు. ఒకప్పుడు కండలు తిరిగి— ఉండిన దేహం ఇప్పుడు వయోభారంతో సడలి ఉంది. అతడు నిటారుగ నిల్చుని ఉన్నప్పటికీ అతని మోకాళ్ళు, నడుము ఇంచుక వంగి ఉన్నాయి.

అతడు రెండడుగులు వేసి గుడిసె బయటి కొచ్చి నిలుచున్నాడు. దొడ్డిలోని పంది అతన్ని చూసి ''గుర్ గుర్'' మన్నది. దాని పిల్లలు కీచుకీచుమని శబ్దం చేసుకుంటూ పాలు తాగుతున్నాయి.

మేతకై వెళ్లిన పందులు తిరిగి రాకపోవడం ముసలివాడు గమనించాడు. సూర్యుడు పడమటి కొండను తాకుతున్నాడు. 'పందులు ఇంకా తిరిగి రాకపోవడం చాల ఆశ్చర్యంగా ఉంది.' అనుకున్నాడు ముసలివాడు. కారణమేమై ఉండ వచ్చునని అతడు ఆలోచించసాగాడు. పందుల్ను గురించిన భయ సందేహాలు అతని మానసంలో పొగవలె రేగుతున్నాయి. అతని ఊహలు అంత కంతకు అధికమై అతనిలో అలజడిని కలుగ జేస్తున్నాయి.

పందులే అతని సర్వస్వం. పందులే అతని స్థిర చరాస్తులు.

అతని మనసంతా కలగాపులగంగా ఉంది.







'పొద్దు గూటిలో పడింది, ఇక కొద్ది సేపట్లో చీకటి పడుతుంది. కాని పందులింకా తిరిగి రాలేదు' అని ఆలోచిస్తూ అతడు ఆందోళన చెందసాగాడు.

భయసందేహాలతో బరువెక్కిన మనసుతోను, నిద్రతో బరువెక్కిన దేహంతోను అతడు పెరడు వైపు నడిచాడు. పెరట్లో ఒక గారతొట్టి ఉన్నది. దాన్లో సగానికి నీళ్లున్నాయి. నీటి అడుగు నుండి పెరిగిన పచ్చటి పాచి నీటి మట్టం పైన తేలి యాడుతూ ఉంది.

నీటి మట్టంపైన కూర్చుని ఉన్న కప్ప ముసలివాని రాకతో బుడుంగున మునిగి పాచిలో మాయమైపోయింది. ముసలివాడు తొట్టిలోని నీటిని ముఖంమీద, మెడమీద, గొంతుమీద చల్లుకోసాగాడు.

అతడు అరుదుగా స్నానం చేస్తుంటాడు. అతనికి స్నానంపైన ఒకింత చిన్నచూపు కద్దు. పరిశుభ్రతను గురించి ఖాతరులేదు. అతని గురి, నమ్మిక అంతా దృఢత్వం మీదనే. ఈ లోకంలో కొందరు దినానికి రెండుసార్లు స్నానం చేస్తుంటారనే సత్యాన్ని అతడు కలిమాయలోని ఒక అంశగా భావిస్తాడు.

అతడు నోట్లో నీళ్ళు పోసుకుని పుక్కిలించి ఉమిసి, నడుమెత్తి నిలుచున్నాడు. నీళ్ళు చారలు చారలుగ అతని రొమ్ముమీదుగ, వీపుమీదుగ జారు తున్నాయి. రోజు పొడవునా వేడిగాడ్పులతో కమిలిన దేహంమీద చల్లని నీళ్ళు జారుతూ ఉంటే చాల హాయనిపించింది. అతడు నీటిని తుడుచుకోలేదు.

అతన్ని ఆవరించి ఉండిన మైకం నీటితాకిడితో కొంత సడలింది. అరచేతులకున్న తేమను తొడలకు తుడుచుకుంటూ అతడు మళ్ళీ గుడిసె ముందు కొచ్చాడు. పడమటి కొండను తాకిన సూర్యుడు తన కిరణాలను ఏటవాలుగా ప్రసరిస్తున్నాడు. ఆ కిరణాలకడ్డంగా అరచేతిని పెట్టుకుని ముసలివాడు మట్టిబాటమీదకు దృష్టి సారించాడు. మట్టిబాట వేరుసెనగ చేల మధ్యగాపోతూ అల్లంత దూరాన రెండు కొండల మధ్య మలుపు తిరిగి అదృశ్యమై పోతూ ఉంది. మట్టిబాటమీద మనుష్య సంచారం గాని, జంతు సంచారంగాని కానరాలేదు.

పందులు ఏమైనట్టు? పిల్లవాడు ఏమైనట్టు? అని ఆలోచిస్తూ అతడు ఆందోళన చెందుతున్నాడు. దవడలను చప్పరిస్తున్నాడు. అరచేతులను పిసుక్కుంటున్నాడు. పాదాలొక చోట నిలవడంలేదు. చూపులు, మనసు పలుదిక్కులకు చెదిరిపోతున్నాయి.

'పిల్లవానికి అతీతమైన ఆపదల్లో పందులు చిక్కుకున్నాయేమో! లేక పిల్లవాడే ఆపదల్లో చిక్కుకున్నాడేమో' అని ముసలివాడు అనుకున్నాడు. 'నేను బయలుదేరి వెళ్ళి చూడడం మంచిది' అని అతడు నిశ్చయించుకున్నాడు. కాని ఎక్కడికని వెళ్ళడం? ఏ దిక్కుగా వెళ్ళడం? అనే మీమాంసకు అతడు క్షణ కాలం లోనయ్యాడు.

అతనిలో ఆరాటం క్షణక్షణానికి అధికం కాసాగింది. 'ఇక్కడ నుండి బయలుదేరితే మార్గం తనంతటదే గోచరిస్తుంది. కర్తవ్యం బోధపడు తుంది' అనుకుని అతడు గుడిసెలోకి నడిచాడు.

తలుపు మూసినా తెరిచినా గుడిసె లోపల కావలసినంత వెలుతురు ఉంటుంది. గుడిసె కప్పు సగానికి ఎగిరిపోయి ఉన్నది. గోడలు పగిలి అక్కడక్కడ నెరియలు చీలి ఉన్నాయి. ఆ నెరియలగుండా సూర్య కిరణాలు లోపలికి చొచ్చుకుని వస్తున్నాయి. తొండ ఒకటి నెరియలో కూర్చుని ముసలివాని పోకడలను చూస్తూ తల ఆడిస్తూంది. గోడకు కల్లు దుత్త వ్రేలాడుతూంది.

ముసలివాడు దుత్తను రెండు చేతులతో తీసుకుని పెదవుల కంటించుకున్నాడు. కల్లు నోటిలో కమ్మని రుచి కలిగిస్తూ గొంతు వెంబడి దిగి కడుపులో కుదురుకుంటున్నది. ఒక్క పెట్టున అతడు దుత్తను ఖాళీచేసి గోడకు తగిలించాడు. పెదవులను తడుముకుని లొట్టవేశాడు.

''నేనిప్పుడు పందులను వెతుక్కుంటూ పోతున్నాను. పందులేదైనా ఆపదలో చిక్కుకుని వుంటే వాటిని రక్షించాల్సి ఉంటుంది. అప్పుడు ధైర్య సాహసాలను, బలదర్పాలను ప్రదర్శించవలసి ఉంటుంది. ఇంకొక ముంతెడు కల్లు తాగ గలిగితే బాగుండును'' అనుకున్నాడతను. ప్రస్తుతం తన గుడిసెలో అదనంగా కొంత కల్లు లేనందుకు అతడు ఇంచుక చింతించాడు.

అతడు ప్రయాణానికి సిద్ధమవుతున్నాడు. తలపాగాను బిగించి కట్టుకున్నాడు. కత్తిని తీసి బొడ్లో దోపుకున్నాడు. చూరులో ఉన్న ఈటెను తీసి చేతబట్టుకున్నాడు. 'పందుల్ని, పిల్లవాణ్ణి ఎలాంటి పరిస్థితిలో చూస్తానో తెలియదు. సాయుధుడనై వెళ్లడం శ్రేయస్కరం.' అనుకున్నాడతడు.

అతడు గుడిసెను వదలి మట్టిబాట మీద పడి పడమటి దిక్కుగా నడవసాగాడు. పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ, చేతిలోని ఈటెను ఊపుకుంటూ అస్తమిస్తున్న సూర్యుని పైన దండెత్తిన వానివలె అతడు నడుస్తున్నాడు.

కడుపులో కల్లు వెచ్చనవుతున్నట్టు, పొంగు తున్నట్టు ముసలివానికి అనిపిస్తూ ఉంది.

## 2

సూర్యుడు పడమటి కొండవెనక క్రుంకాడు. అది పౌర్ణమినాటి ముందు దినం. ఆకాశంలో చంద్రుడు అప్పటికే తాటిచెట్టు ప్రమాణం ఎగ్రబాకి తన సోదరునికి వీడ్కోలు చెబుతున్నాడు.

ముసలివాడు నడుస్తుండగా అతని మోకాళ్ళు, నడుము వంగి ఉండడం మరింత స్పష్టంగా కనిపిస్తున్నది. అయినప్పటికీ అతని నడకలో గంభీరత నిండార్లుగా ఉంది. రాజవీధులలో మదగజం వలె, ఆకాశంలో కారుమేఘం వలె హుందాతనంతో అతడు సాగుతున్నాడు.

పడమటి కొండ వెనకనుండి నిట్టనిలువుగ ప్రసరించి ఆకాశాన్ని పొడుస్తున్న సూర్యకిరణాలు క్రమక్రమంగా ముడుచుకుంటున్నాయి. అంతకంతకు గాలి చల్లబడుతూంది. తూర్పున చంద్రుడింకా కాంతిని పుంజుకోలేదు. చంద్రుడు కలగ జేసిన నీడలు వయసురాని వాని మీసంవలె పల్చగా, అస్పష్టంగా ఉన్నాయి.

ముసలివాడు సుదీర్ఘంగా ఉన్న తన నీడను తొక్కుకుంటూ నడుస్తున్నాడు. అతనికన్నా వేగంగా, అతని నీడకన్న వేగంగా అతని మనసు పందుల క్షేమాన్ని గురించి ఆరాటపడుతూ పరుగిడుతూంది

అతడు ఇరవై పందులకు స్వంతదారుడు, అందులో రెండు సుక్క పందులున్నాయి. మొదటి సుక్క పంది ప్రస్తుతం సలుగులను పక్కన వేసుకుని దొడ్డిలో ఉంది. అది సలుగులను నాలుగు రోజుల క్రితం ఈనింది. ఆ రోజు ముసలివాని జీవితంలో మధురాతి మధురమైనది. సుక్కపంది దొడ్డిలో సలుగుల నీనిన వార్త చెవిసోగగానే అతడు సంతోషంతో పరవశించిపోయాడు. క్రోసెడు దూరం నుండి పల్లటీలు వేసుకుంటూ దొడ్డి చెంతకు చేరాడు. మడిచిన మోకాళ్ళను చాచకుండా, వంచిన నడుమును పైకెత్తకుండా రెండు జాములసేపు నంగిడతలు కొడుతూ దొడ్డి చుట్టూ తిరిగాడు. పిల్లవాడుకూడా అతనితో బాటు నంగిడతలు కొట్టడం ప్రారంభించాడు.

గాని వాని లేతకాళ్ళు కొద్దిసేపటికే అలసిపోయాయి. గాదులేచి చేతి వేళ్ళను నోట్లో పెట్టుకుని ఈల వేస్తూ దొడ్డి చుట్టూ పరుగెత్తాడు. ఈపూట ఆ పూట వాళ్ళు ధుత్తలతో కల్లు తెచ్చుకుని ఏత్తుగా తాగారు. పిల్లవాడు కల్లును హరించుకోలేక వాంతులు చేసుకోగా ముసలివాడు బొక్కెనతో నీళ్ళు వాని నెత్తిన దిమ్మరించి మరో కల్లుముంతను చేతికిచ్చాడు. వాళ్ళు సర్వస్వం మరిచిపోయి ముసలి వాడు పిల్లవాడై, పిల్లవాడు ముసలివాడై దొర్లారు. ఒకరు మార్చి ఒకరు ఏలకతలు పాడుతూ ఆ రాత్రంతా ఆ వీధిలోని వారినెవ్వర్నీ నిద్ర పోనీయ కుండా గడిపారు.

తెల్లవారేసరికి ముసలివాని గొంతు రాచిపోయి మాటలాడడం దుస్సాధ్యమైపోయింది. చేతిసైగలతో ముఖ కవళికలతో మంతనాలు జరపాల్సి వచ్చింది. వాంట్లోని కీళ్ళన్నీ పచ్చి పుళ్ళయిపోయాయి నొప్పులను బాపుకునేందుకు అతడు నిప్పులలో కాలిన కళ్ళి కొమ్మలను తొక్కాడు. కీళ్ళకు చింతాకు పట్టు వేశాడు. సుక్కపంది సలుగుల్నీని మూడు రోజా లైంది సలుగులు పురిటితేమ ఆరి కళ్ళు తెరిచి తిరుగాడుతున్నాయి ముసలివాడు మాత్రం ఇంకా స్వస్థత చెందలేదు. కీళ్ళవాపు తగ్గిందిగాని నొప్పులు తగ్గలేదు. గొంతు మండడం లేదుగాని మాటలు సరిగా వెలువడడం లేదు

ముసలివాని రెండో చుక్కపంది నేడో రేపో సలుగుల నీనడానికి సిద్ధంగా ఉంది. దానిని పిల్లవాడు మిగిలిన పందులతో బాటు మేతకై తోలుకొని పోయి ఉన్నాడు 'బహుశ అది మేతకై వెళ్ళిన తావున్నే అది సలుగులను ఈనిందేమో' అనే ఆలోచన ముసలివాని తలలో దిగ్గున మెదిలింది.

అసంకల్పితంగా అతడు బాటమీద ఆగిపోయాడు. ఆకాశంలో తూర్పు వాలున ఉన్న చంద్రుడిని చూస్తూ అతడు ఆలోచించసాగాడు. అతని సుక్కపందులు రెండూ ఒకేసారి సలమయ్యాయి ఎవరు చెప్పారో ఎలా చెప్పారోగాని సుక్కపందులు సలమై ఉన్న విషయం ఊర్లో ఉన్న గున్నలన్నింటికీ తెలిసిపోయింది. అవి మోరలను, తోకలను పైకెత్తుకుని "గీ" మని అరుస్తూ ఆ రెండు పందుల వెంట తిరగడం ప్రారంభించాయి ఆ రెండింటిని తొక్కడానికి పోటీపడుతూ గున్నలు

# అతడు అడవిని జయించాడు

నిద్రాహారాలు మాని ప్రయత్నం చేశాయి తన పందులను సుక్కగున్నలే తప్ప వేరొక నాసిజాతి గున్నలు తొక్కడం ముసలివానికి ఇష్టంలేదు. అతడు బడితె చేతబట్టుకుని నాసిజాతి పందుల్ని ఆ పరిసరాల్లో మెదలనీయకుండా తరిమికొట్టాడు. చివరకతని అభీష్టం నెరవేరింది. అతని రెండు పందులను సుక్కగున్నలే తొక్కాయి.

తన సుక్కపందులు రెండూ ఒకే రోజున సలుగుల నీనుతాయని అతడు ఆశించాడు. కాని అలా జరగలేదు మొదటి పంది పౌర్ణమి ఇంకా నాలుగు రోజులుండనగా ఈనింది. రెండో పంది నేడో రేపో ఈనడానికి సిద్ధంగా ఉంది.

'సందేహం లేదు. మేతకు వెళ్ళిన తావున్నే అది ఈనేసింది ఏమి చేయాలో తెలియక పిల్లవాడికి కాళ్ళు చేతులు ఆడి ఉండవు. అందుకే ఆలస్య మయింది.' అనుకున్నాడు ముసలివాడు.

అతడు మళ్ళీ నడక ప్రారంభించాడు "నెలలు నిండిన ఈ స్థితిలో సుక్కపందిని బయటకు వదలవలసిందికాదు. దొడ్డిలోనే ఉంచి తిండినీళ్ళు పెట్టవలసింది. మరి ఇవన్నీ చూసుకోవడానికి వీలు లేకుండా నేను కీళ్ళనొప్పులతో మూలబడితిని. పిల్ల వానికి తగిన ఇంగితము, అనుభవము లేదాయె." అని ముసలివాడు తలపోయసాగాడు.

ముసలివాని తలలో సుక్కపందిని గురించిన ఆలోచనలు దట్టంగా ముసురుకుంటున్నాయి.

మూర్ఖత్వానికీ, రౌద్రానికీ సుక్కపంది పెట్టిందిపేరు సలుగులనీనిన పిదప వారం రోజుల పాటు అది దయ్యంవలె ప్రవర్తిస్తుంది. తనవారిని గాని పగవారినిగాని దరిజేరనియ్యదు దాపుకెవరైనా వస్తే చీల్చి చెండాడుతుంది. బొందిలో ప్రాణ ముండగా అది సలుగులపైన ఈగనుసైతం వాల నివ్వదు. సలుగులను పక్కనేసుకుని పడుకునిఉండగా చీమ చిటుక్కుమన్నా అది దిక్కున లేచి మోర ఎత్తి చూస్తుంది. దాపున మనిషిగాని, ఏదైనా జంతువుగాని కనిపిస్తే అది రౌద్రాకారం దాలు స్తుంది. సలుగులకు హానిచేయడానికి శత్రువు పొంచి ఉన్నట్లు భావిస్తుంది. పుట్టుకతో తనకు సంక్ర మించిన మొరటుతనంతో అది శత్రువుమీద విరుచుక

పడుతుంది. ఆ పోరులో శత్రువు పలాయనం చెందడమో, ప్రాణంపోగొట్టుకోవడమో జరిగితేగాని అది తిరిగిరాదు.

ముసలివాడు మట్టిబాటమీద గబగబ నడుస్తు న్నాడు. మాటి మాటికీ, "ఓరి గోపాలో!" అని కేకలేస్తూ తన మనుమడిని పిలుస్తున్నాడు ఏ దిక్కునుండిగాని అతని కేకలకు సమాధానం రావడం లేదు. గొంతు రాచిపోయి ఇప్పుడిప్పుడే కోలుకుంటూ ఉండడంవల్ల అతని కేకలు గట్టిగా వినిపించడం లేదు. వయసురాని కోడిపుంజు కూతవేసినట్టు గాను, గొంతులో చేపముల్లు గుచ్చుకున్న గుంట నక్క ఊళ వేసినట్టుగాను అతడు కేకలు వేస్తున్నాడు.

## 3

కొంతసేపటికి అతని పందులు బాటమీద ఎదురుగా వస్తుండడం ముసలివానికి కనిపించింది అవి గునగున నడచి వస్తుంటే నల్లగుండ్లు దొర్లుకుని వస్తున్నట్లుంది. అతడు వాటికోసం ఎదురుచూస్తూ బాటమీద నిలుచోలేదు. మరింత వేగంగా పందుల కెదురుగా నడిచి వాటిని కలుసు కున్నాడు. పందులన్నీ తమ యజమానిని గుర్తించి బాటమీద ఆగిపోయాయి అవి మోరలను పైకెత్తి ముట్టెలను ఆడిస్తూ గుర్‌గుర్‌మని అరవసాగాయి సన్నటి తోకలను ఆడిస్తూ అతని ముందు అల్లిబిల్లిగా తిరగసాగాయి. ముట్టెలతో ఒకదాని డొక్కలో మరొకటి కుమ్ముతూ సందడి చేయ సాగాయి.

ముసలివాని చూపులు సుక్కపంది కోసం గాలిస్తున్నాయి. పందుల గుంపులో సుక్కపంది లేకపోవడం అతడు గమనించాడు. రెండు మూడు సార్లు గుంపును కలయజూశాక అతని చూపులు పిల్లవానిపైన వాలాయి.

పిల్లవాడు చాలసేపట్నుంచి ఏడుస్తుండినట్లు న్నాడు దుమ్ముతో నిండి ఉన్న చెంపలమీద కన్నీళ్ళు జారిన గుర్తులు కనిపిస్తున్నాయి. కన్నులు ఎర్రబారి ఉన్నాయి. ఎర్రనై ఉన్నకళ్ళను వాడు నలుముకుంటూ వెక్కుతూ నిలుచుని ఉన్నాడు.

"సుక్కపంది ఏమయిందిరా ?" అనడిగాడు ముసలివాడు సుక్కపంది కనపడక పోవడానికీ పిల్ల వాని ఏడుపుకు కారణం ఒకటేనని అతనికి తెలుసు

పిల్లవాడు తన నడుంమీద జారిపోతున్న తుండు గుడ్డను ఒక చేత్తో పట్టుకుని మరొకచేత్తో కళ్లు నులుముకుంటూ "పైటేళ నుండి కనబడలా" అన్నాడు.

కనుబొమలు ముడివేస్తూ ముసలివాడు "ఎట్టెట్టా ?" అన్నాడు.

"ఏడేడ వెతికినా పైటేళకాడ నుండి కనపళ్లేదు. ఈతెర్తుకోని ఇంటికొచ్చేసిందేవో ననుకున్నా."

"ఇంటికి యాడొచ్చింది. ఇంతసేపు ఇంటికాడ్నే ఉండినా. సూసి సూసి సాలైపోయి యలబారి ఇటొచ్చినా" అని కొంత ఆగి "అది ఈతెత్తుక నిందని నీకెట్ట తెల్సు ? తిగలేసిందా ?" అనడిగాడు

"తిగలెయ్యటం నేను సూడలా. ఈతిపొదల పడుకుని మూలగతా కొంచేపుండి లేసొచ్చేసింది

గాయక సార్వభౌమ రామకృష్ణయ్య పంతులు సంగీత విద్యాలయం (విజయవాడ) వార్షికోత్సవంలో నివేదిక సమర్పిస్తున్న ప్రిన్సిపాల్ శ్రీమతి కె అన్నపూర్ణ, సభాధ్యక్షులు డా బాలమురళీకృష్ణ, ముఖ్య అతిథి శ్రీ మహదేవ రాధాకృష్ణరాజు, ముఖ్య సలహాదారు శ్రీ అన్నవరపు రామస్వామిగార్లని చిత్రంలో చూడవచ్చు.



# "మమ్మీ, ఈ దురద, మంటను ఎలాగైనా ఆపవూ."

**నైసిల్**
ఉపయోగించండి
అతి శీఘ్రంగా
ఉపశమనమునిచ్చే
చెమటకాయల పౌడర్.




2 రకాల
డబ్బీలలో
దొరుకుతుంది.
'నీలం' మరియు
'చందనం.'

## నైసిల్ తెచ్చుకోండి
## చెమటకాయల బాధ మరిచిపోండి.

ప్రత్యేకమైన ఔషధ యుక్త నైసిల్ చెమటకాయలను ప్రతి స్థితిలోనూ ఎదుర్కొంటుంది.

1. అధికమైన చెమటను నిరోధిస్తుంది.
2. చెమటను పీలుస్తుంది.
3. దుర్గంధాన్ని కల్గించే సూక్ష్మజీవులను నాశనం చేస్తుంది.
4. చర్మమునకు హాయి గొల్పుతుంది.

పైగా నువ్వే చెప్తా ఉంటివి గదా – పవర్నంనాటికో పవర్నంముందు నాటికో ఈనేస్తాదని."

ముసలివాడు "నేను చెప్పేటంతలో అగ్గిబడి నట్టు ఉంది" అని గొణుక్కుని, పిల్లవాడిని గద్దిస్తూ "ఈ పొద్దో రేపో ఈనబోయే పందిని దొడ్లోనే ఉండనీయకుండా బయటకెందుకిడిస్తివి ? బయట కిడ్సినోడివి దానిమీదొక కన్నేసి ఉండక యాడ పెత్తనాలు చేస్తా ఉంటివి ?" అన్నాడు.

పిల్లవాడు గుక్కిళ్లు మింగుతూ నిల్చున్నాడు. వాడి ఎడమ భుజం నుండి వంగలకర్ర వేలాడుతూ ఉంది. కుడిభుజానికి ఒక జోలె వేలాడుతూంది. వాడు కొట్టిన పిట్టలు జోలెలో ఉన్నాయి. పిట్టల తాలూకు బూడిదరంగు రెక్కలు, ఎర్రటి కాళ్ళు పైకి కనిపిస్తున్నాయి.

"పిల్లవాడిని కోపగించుకోవడంలో అర్థం లేదు." అనుకున్నాడు ముసలివాడు, "వాడు వంగల కర్ర చేతబట్టుకుని చెట్లవెంబడి తిరుగుతూ ఉండి ఉంటాడు. వంగలకర్రలో గులకరాళ్ళు పెట్టి పిట్టల తలలలోని మెదడును చెదరగొట్టడంలో మునిగిపోయి ఉంటాడు."

"మళ్లీ ముండమోపిమాదిరి ఏడిసేదేనిటికి ? ఇనిట్నే బద్దరంగా తోలుకొనిపోయి దొడ్డిలోకి చేర్చు. నేను సుక్కపంది ఏమయిందో సూసొస్తా." అని బయలుదేరి నాలుగడుగులేసి ఆగి, "పందుల్ను యాడికి తోలుకోని పోయుంటివి ? సుక్కపందిని కడాన యాడ సూస్తివి ?" అనడిగాడు.

"బరకలకుంటకాడ కనబడింది కడాన. మల్ల కనబడలా." అన్నాడు పిల్లవాడు.

"సరే నువ్వు పో. పందులకు కుడితిపెట్టి దొడ్లో తోలి బద్దరంగా సూస్కో. సుక్కపంది కత నేను జూసుకుంటా" అంటూ ముసలివాడు బయలుదేరాడు.

అతడు వడివడిగా నడవసాగాడు. అతని గమన వేగం మనసులోని కోలాహలాన్ని సూచిస్తూ ఉంది. చేతిలోని ఈటెను ఊపుకుంటూ, తన నీడను నజ్జు గుజ్జుగా తొక్కివేయడానికి ప్రయత్నిస్తున్నట్లు అంగలు వేసుకుంటూ నడుస్తున్నాడు. అతని మనసు అతనికన్నా ముందుగా పయనించి అతన్ని లాగుతున్నది. క్రమక్రమంగా అతని నడక పరుగుగా మారింది. మట్టి బాటమీద అతని పాదాలు తపతప పడుతున్నాయి.

## 4

ఇంచుక సేపటికి అతడు 'బరకల కుంట'ను చేరాడు. వేసవి గనుక కుంట చాలవరకు ఎండిపోయి కట్టవద్ద మాత్రం కొద్దిగా నీళ్ళున్నాయి.

నీళ్ళలో పందులు తనివితీర దొర్లినట్టున్నాయి. నీళ్ళు బురదమయమై ఉండడం వెన్నెలలో కని పిస్తున్నది. ముసలివాడు "హూచ్ హూచ్" అని అరుస్తూ కట్టవెంబడి నడవసాగాడు. ఆ చివరన కట్టదిగి నీటి అంచు వెంబడి నడవసాగాడు. పందులు, బర్రెలు రోజు పొడవునా బురద నీటిలో దొర్లి గట్టెక్కినప్పుడు వాటి దేహాలనుండి కారిన నీటి తాలూకు చెమ్మను తొక్కుకుంటూ అతడు నడుస్తున్నాడు. కుంటచుట్టూ ఉన్న పొదలన్నింటినీ అతడు కలదిరుగుతున్నాడు. పొదలలో దూరుతూ అతడు సుక్కపంది కోసం అన్వేషిస్తున్నాడు.

అతడు మళ్ళీ నీటి అంచు వద్దకు వచ్చాడు. నడుమువంచి తేమ నేలమీద పందిఅడుగుజాడలకోసం చూడసాగాడు. తేమ నేలమీద ఎన్నోరకాల జంతువుల అడుగుజాడల గజిబిజిగా కనిపిస్తున్నాయి. దుక్కి దున్ని అరిగిపోయిన గొడ్ల గిట్టల గుర్తులు, నాడాలు కొట్టబడిన కోడెల గిట్టల గుర్తులు అక్కడక్కడ కనిపిస్తున్నాయి. వాటిమధ్యన గొర్రెల గిట్టలు, పందుల గిట్టలు అస్పష్టంగా కనిపిస్తున్నాయి. వాటినన్నిటినీ కలుపుతూ జలగల జాడలు, నానపాముల జాడలు కనిపిస్తున్నాయి.

అతడు నడుమెత్తి నిలుచుని దీర్ఘంగా నిట్టూర్చాడు. వెన్నెలలో కుంట పరిసరాలన్నీ నిశ్శబ్దంగా ఉన్నాయి.

ప్రసవ సూచనలు కనిపించగానే సుక్కపంది విచిత్రంగా ప్రవర్తిస్తుంది. ఏకాంత స్థలాన్ని వెదుక్కుంటూ అది బయలుదేరుతుంది. ఒక్కొక్కసారి అది అలా కొన్ని మైళ్ళు పయనించడం కద్దు. అలా పయనించి చివరకొక దట్టమైన పొదనో, గుహనో చూసుకుని అందులో పిల్లల నీనుతుంది.

ముసలివాడు నీటి అంచువద్ద నిలబడి చుట్టూ చూశాడు. అక్కడున్న పొదలలో ఏదిగాని పందికి అండనిచ్చేటంత పెద్దదిగా లేదు. 'పెటేళప్పుడు అది ఈ ప్రాంతాన్ని వదలి ఎటో వెళ్ళిపోయింది.' అనుకున్నాడతడు.

ఇక్కడనుండి బయలుదేరి ఎక్కడకు పోయి ఉంటుంది ?

తూర్పుగా పోయి ఉంటే మట్టిబాట మీదుగా నడిచి ఇల్లు చేరుకునేది. మట్టిబాట దానికి సుపరిచితమే. కాని అలా జరగలేదు. కనుక అది తూర్పు దిశగా వెళ్ళలేదని తెలుస్తూంది.

కుంటకు ఉత్తరంగా చిన్న నది ప్రవహిస్తున్నది. ఈత ఎత్తుకుని ఉన్న పంది నదిని దాటగలగడం అసంభవమే.

కుంట నానుకుని దక్షిణంగా సువిశాలమైన మైదానం ఉంది. మైదానం నిండా పచ్చగడ్డి, వెంపలి చెట్లు మాత్రం ఉన్నాయి. మోకాలెత్తు ఉన్న పొద ఒకటిగూడా లేదు. ఏకాంతాన్ని వెదుక్కుంటూ బయలుదేరిన పంది అటు వెళ్ళి ఉండదు.

ఇక కుంటవద్ద ప్రారంభమై ఒక అడవి పడమటి దిక్కుగా వ్యాపించి ఉన్నది. వర్షాకాలంలో కుంటను నీటితో నింపే వంక అడవిలోనుండి వస్తున్నది. అడవి నల్లగా, గాఢంగా, అనంతంగా పరచుకుని ఉంది.

'సుక్కపంది ఇలా పడమరగా వెళ్ళి అడవిలోకి ప్రవేశించి ఉంటుంది.' అనుకున్నాడు ముసలివాడు. తను అలా భావించడానికి ఆధారం ఏమైనా ఉందా అని అతడు ప్రశ్నించుకున్నాడు. 'వేరే ఆధారమేమీ లేదు. ఈత ఎత్తుకోగానే సుక్కపంది పొదలను, గుహలను వెదకుతూ ఎన్ని ఆమడల దూరమైనా పోతుంది. అదే ఆధారం' అనుకున్నాడతడు.

చంద్రుడు ఆకాశంలో ఎగబ్రాకుతున్నాడు. రాత్రి ముదురుతున్నది. కాలయాపన చేయడం ముసలివానికి ఇష్టంలేదు. అతడు కుంటను వదిలి పడమటి దిక్కుగా అడవివైపు నడవసాగాడు. ..

(ఇంకా వుంది)

# వ్యక్తిగతం

కే. శే. కంవల్ సిధుకి మరణానంతరం పద్మశ్రీ వచ్చింది. ఈమె సంగీత విద్వాంసురాలుగ పేరు పొందారు ...



కీ.శే. మారిలిన్ మన్రో జీవిత కథని సినిమాగా తీస్తున్నారు. మారిలిన్‌గా వేసేందుకు స్టిఫానీ లారెన్స్ అనే 28 ఏళ్ల అమ్మాయిని ఎంపిక చేశారు. ఈమె బరువు 110 పవునులు. ఇది చాలదని ఆమె బరువు మరొక 14 పవునులు పెరిగేందుకు స్టిఫాని కొన్ని రకాల వేపడాలు తింటోందిట ...

ఈయన అసలు పేరు జాక్‌ఫెర్డిగ్. అమెరికా సంయుక్త రాష్ట్రాలలోని శాన్ ఫ్రాన్‌సిస్కోలో ఉంటాడు. ఆడ వేషం వేసుకోవటం ఈయనకి సరదా. అంతేకాదు. ఒక క్రయిస్తవ స్త్రీ సాధువు లేదా 'నన్' వేషం వేసుకుని మునిసిపల్ ఎన్నికలో పాలుగొన్నాడు గెలవలేదు కాని 21000 పయిగా వోట్లు తెచ్చుకున్నాడు.



అభ్యర్థిగా అతను "సిస్టర్ బూమ్ బూమ్" అనే పేరు వాడాడు. ఈ పేరే కాకుండా "జేమ్స్ బాండ్ జీరో" వగయిరా • పేరులు వాడగలనన్నాడు. కాని శాన్‌ఫ్రాన్‌సిస్కో మేయర్ శ్రీమతి డయానా ఫెయిన్‌స్టెయిన్ "మారు పేరులు వాడరాదు" అని ఒక ఆదేశాన్ని జారీచేశారు ...

# వారఫలం

20–5–1983 శుక్రవారం మొదలు 26–5–1983 గురువారం వరకు

♈ **మేషం:** ఒకానొక విషయం సులభంగా, ఆనందంగా ఈ వారం జరుగమన్నది. చాలమందికి అప్పులు వసూలు కాగలవు. దూర ప్రాంతాల నుండి అయిన వారు రానున్నారు. స్త్రీలకు: అన్ని రంగాలల్లో అన్ని విధాలా మేలు చేకూరే అవకాశం గల వారం.

♉ **వృషభం:** చుట్టపక్కాలు యింటికి రానున్నారు. భూ సంబంధ వివాదాలు సులభంగా పరిష్కారం కాగలవు. అనవసర కలహాల జోలికి పోరాదు, గ్రహించండి. చాలమందికి విద్యా యోగ్యతా సంపాదనకు అనుకూల కాలం. దూర ప్రాంతాలకు ప్రయాణింప గలరు. స్త్రీలకు: గృహానందం, కార్య భారం, ఆదాయం గల వారం.

♊ **మిధునం:** పోయిన వస్తువులు గాని, వాహనం గాని, దొరక గలదనే ఆశ లేదు. ఆస్తి సంబంధమైన వివాదం కొందర విషయంలో చెప్పదగిన అంశం. శత్రు వర్గీయుల బాధ నుండి విముక్తి నొంద గలరు. స్త్రీలకు: అన్ని విధాలా లాభ దాయకం, ధనాగమానికి మార్గ మున్నది.

♋ **కర్కాటకం:** ఆశయాలు ఫలిస్తాయి. అనుకొన్న విధంగా ధనం చేతికి అందే మార్గ మున్నది. వ్యవహార విషయం గా మీకే అనుకూలం సిద్ధం. నూతన విషయాలు తెలిసికొనే అవకాశ మున్నది. స్త్రీలకు: సాటివారి సహాయం, ఆట పాటల్లో అనుకూలం సంభవం.

♌ **సింహం:** అన్ని విధాలా జాగ్రత్తగా ఉండాలి. అలా కాకుంటే చాల విధాల యిబ్బందులకు గురి కాగలరు, గ్రామ పెద్దరికం అమరు తుంది. మీ మాటను నలుగురు ఆదరిస్తారు. ప్రతిభ రాణించే అవకాశం, ధనాదాయం, స్థిరాస్తి పెంపకానికి అవకాశం ఉన్నది. స్త్రీలకు: నాల్గు విధాల మేలు ధన లబ్ధి, కోర్టు వ్యవహారా లుంటే, విజయం సిద్ధమే.

♍ **కన్య:** నూతన విషయాలు తెలిసికొంటారు. వ్యాపారం సర్వానుకూలంగా, విజయవంతంగా, లాభదాయకంగా నెరవేరు తుంది. చాలమంది సంఘ సేవాపరాయణులు కాగలరు. పరాయి వారికి చాలమంది సహాయ పడ నున్నారు. స్థిరాస్తి పెంచు కొనే ప్రయత్నాలు కావిస్తారు. స్త్రీలకు: రాబడి వృద్ధి చెందటం, ముఖ్యులను కలిసి కోవటం, విద్యా యోగ్యతను పెంచుకోవటం జరుగుతుంది.

♎ **తుల:** ఆదాయ మున్నది. నాలుగు విధాలా అవకాశాలు లభిస్తాయి. దూర ప్రాంతాల నుండి బంధువులు యింటికి రాగలరు. మీరు కూడా ఏదో విషయంగా దూర ప్రాంతాలకు పోనున్నారు. స్త్రీలకు: ఆర్థికంగా బాగుండటం, అధికారుల మన్నన పొందటం గమనించ దగిన అంశం.

♏ **వృశ్చికం:** సులభంగా ఒకానొక విషయం నెరవేర నున్నది. పెద్దల మూలాన, బంధువుల మూలాన మేలు జరుగ బోవు చుండుట గమనార్హము. సభా కార్య క్రమంలో చాలమందికి మేలు జరుగు తుంది. స్త్రీలకు: అధికారం వృద్ధి చెందటం, ఉద్యోగంలో పై అంతస్థు, అందుకు తగిన ఆదాయం అభివృద్ధి చెందు తుంది.

♐ **ధనుస్సు:** మీకు అంతస్థు పెరగటం, వృత్తిలో అభివృద్ధి కనిపించటం విలువగల వస్తువులు సంపాదించు కొనటం, నూతన వ్యక్తులతో పరిచయం లభించటం గమనిస్తారు. స్త్రీలకు: గృహ కార్య కలాపాలతో సతమతం కావటం, బంధువుల మూలంగా మేలు జరగటం గమనించగలరు.

♑ **మకరం:** ఆదాయ మున్నది. వ్యాపారం బాగా చేయటానికి, లాభం సంపాదించటానికి, అధికారుల ఆదరణకు పాత్రం కావటం గమనించ దగిన అంశాలు. మీ మిత్రుల మూలంగా ఏదో మేలు సంభవించనున్నది. మీ యాసక్తి ధన సంపాదనా విషయంలో అతిశయిస్తుంది. స్త్రీలకు: ధన సంపాదనా, నూతనోద్యోగ ప్రాప్తికి అవకాశం గల దివారే.

♒ **కుంభం:** విలువగల వస్తువులు సేకరించ గలరు చాల కాలంగా చేతికి అందని ధనం ఈ వారం అంద గలదు. మిత్ర బాంధవ సహాయం చేకూరే అవకాశం, పెద్దల మూలంగా మేలు జరగటం, యత్న కార్య సిద్ధి చేకూరుతుంది. స్త్రీలకు: నాలుగు విధాలా లాభం చేకూర గల వారమే.

♓ **మీనం:** అధికార వర్గం మూలాన మేలు చేకూర గలదు. స్థిరాస్తి పెంపకం, విక్రయ మార్గాన లాభించటం, గమనింప దగిన అంశాలు. కొందరకు ఆరోగ్య భంగం చెప్ప దగిన అంశం. కొందరకు, అప్రయత్నంగా ధనా గమం చెప్ప దగిన అంశం. స్త్రీలకు: వివిధ విషయాలు గ్రహించటం, వివిధ మార్గాల ధనాదాయం చేకూరటం గమనింప దగిన అంశాలు.

— విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి ★



కాశీనాథ & కాశీనాథ

విశాలమైన కాంపౌండ్ మధ్యగా విద్యుద్దీపాల కాంతిలో శకుంతలా నివాస్ మెరిసిపోతోంది.

ఆ కాంపౌండ్‌లో ఒక మూలగా దిష్టిచుక్క పెట్టినట్టుగా ఒక పాక, పనిమనిషి సీతమ్మది.

పోర్టికోలో కార్లు, స్కూటర్లు ఒక్కొక్కటే ఆగుతున్నాయి. ఖరీదైన దుస్తులు ధరించిన మనుషులు దిగుతున్నారు. ఎక్కువమంది స్త్రీలే. కొందరు పురుషులు భార్యల వెంట వచ్చారు.

గుమ్మం దగ్గిర కంచిపట్టు చీరలో, మెడలో రవ్వల నెక్లెస్‌తో ఇంటి యజమానురాలు శకుంతల నుంచుని ఉంది. పక్కన బ్రవున్ రంగు ఫుల్ సూటు వేసుకుని మెడలో బంగారు గొలుసు వేసుకుని శకుంతల అయిదేళ్ల కొడుకు శ్రీనివాస్ ఉన్నాడు. శకుంతల భర్త రమేష్ ఉదయమే అర్జంటు పనిమీద అనుకోకుండా వెళ్లాల్సి వచ్చింది.

ఒక్కొక్క వ్యక్తి వస్తున్నప్పుడల్లా శకుంతల 'రండి. లోపల కూర్చోండి' అంటూ ఆహ్వానిస్తోంది. శ్రీనివాస్ 'వెల్‌కమ్ టూ యూ' అంటున్నాడు. శ్రీనివాస్‌ని ముచ్చటగా చూస్తూ ఆహ్వానితులు లోపలికి వస్తున్నారు.

లోపల అంతా మొజాయిక్ ఫ్లోర్. డెకొలామ్ అమర్చబడిన రోజ్‌వుడ్ బల్లలు క్రమపద్ధతిలో అమర్చబడ్డాయి. సన్నగా ఇంగ్లీషు సంగీతం వినిపిస్తోంది. గాలి తెరలకి కర్టెన్లు కదులుతూ వింత అందాన్నిస్తున్నాయి. వాతావరణం ఆహ్లాదకరంగా ఉంది.

ప్రతీ టేబుల్‌కి అటు రెండు, ఇటు రెండు కుషన్ కుర్చీలు ఉన్నాయి. ప్రతి టేబుల్‌మీద పాత్రల్లో పదార్థాలు మూత పెట్టబడి ఉన్నాయి.

అది శ్రీనివాస్ పుట్టినరోజు ఫంక్షన్.

ఇంత పార్టీలోనూ సర్వర్లు ఎక్కడా లేరు. సెల్ఫ్ సెర్వింగ్ అరేంజిమెంటు. రమేష్‌కీ, శకుంతలకీ ఈ పద్ధతే ఇష్టం. వాళ్ల ఇంట్లో నౌకర్లెవరూ లేరు, పనిమనిషి సీతమ్మ తప్ప.

ఎక్కడి ఏర్పాట్లు అక్కడ జరిగిపోవడంవల్ల శకుంతల హడావిడిగా లేదు.

ఆహ్వానితులంతా సీట్లలో కూర్చున్నారు.

విందు ప్రారంభం అయింది.

శకుంతల ప్రతీ టేబులు దగ్గరికీ వెళ్లి అతిథుల్ని పలకరిస్తోంది. ఏంకావాలని అడుగుతోంది. 'హాంటె నీ థింగ్ మోర్ ?' అంటున్నాడు శ్రీనివాస్.

అతిథులందరినీ శ్రీనివాస్ చాలా ఆకర్షించాడు. అసలే చూడటానికి అందంగా ఉన్నాడు, కాన్వెంటులో నేర్చుకున్న స్వచ్ఛమైన ఉచ్చారణతో ఇంగ్లీషు మాటలు పలుకుతూ ఉంటే చూసేవాళ్లకి ముచ్చటగా ఉంది. 'అయిదేళ్ల పిల్లవాడి పుట్టినరోజుకి పెద్ద వాళ్లం రావటం దేనికి?' అని వచ్చేముందు అనుకున్న ఆహ్వానితులకి ఇప్పుడు ఆ ఊహే లేదు.

పార్టీ అయిపోయింది. అతిథులు ఒక్కొక్కళ్లే వెళ్లిపోతూ ఉంటే శ్రీనివాస్ 'సీయూ ఎగైన్' అంటున్నాడు. కొంత మంది ఆనందం పట్టలేక శ్రీనివాస్‌ని ఎత్తుకుని ముద్దు పెట్టుకున్నారు.

శకుంతల తృప్తిగా చూసింది.

* * *

పని మనిషి సీతమ్మ అయిదేళ్ల కొడుకు సోముతో వచ్చి ప్లేట్లన్నీ కడగటానికి తీసి టేబుల్స్ శుభ్రం చేస్తుంటే శకుంతల మేడ మీదికి వెళ్లింది. శ్రీనివాస్‌కి బట్టలు మార్చి లాల్చీ, పైజమా తొడిగింది. పది నిమిషాలు వాడితో కబుర్లు చెప్పి వాడికి నిద్ర వస్తోంటే ఫోమ్ బెడ్‌పై పడుకోబెట్టింది.

విశ్రాంతిగా అయిదు నిమిషాలు పడుకుంది.

ఉన్నట్టుండి 'వెల్‌కమ్ టూ యూ' అని వినపడింది శకుంతలకి. శకుంతల నవ్వుకుంది.

'నిద్రలో కూడా బాబు కలవరిస్తున్నట్టున్నాడు' అనుకుంది.

'మళ్లీ వెల్‌కమ్ టూ యూ' అని వినపడింది.

శకుంతల బాబుకేసి చూసింది.

బాబు కలవరించటం లేదు !

గాఢంగా నిద్రపోతున్నాడు.

'మరి ఆ మాట ఎక్కడిది ?'

మళ్లీ 'వెల్‌కమ్ టూ యూ' అని వినపడగానే శకుంతల లేచి కిటికీ దగ్గరకి వెళ్లింది. కిందికి చూసి ఆశ్చర్యపోయింది !

విందులో మిగిలిన పదార్థాలన్నీ ప్లేట్లలో అమర్చి ఉన్నాయి. ఆ ప్లేట్ల ముందు సోము స్నేహితులు కూర్చుని ఉన్నారు. సోము ఒక్కొక్కళ్ల దగ్గరికీ వెళ్లి 'హాంటె ని థింగ్ మోర్ ?' అంటూ వడ్డిస్తున్నాడు. వాళ్లు ఆత్రంగా తింటున్నారు.

ఏమీ పరిచయం లేని ఇంగ్లీషు మాటలు నాలుగు సార్లు విని అదే స్పష్టతతో, అదే మాడ్యులేషన్‌తో అనగలిగిన సోము ధారణశక్తికి ఆశ్చర్యపోయింది శకుంతల.

అయిదు నిమిషాల తర్వాత శకుంతల కిందికి వెళ్లింది. ఒక్కొక్కళ్లే బయటికి వెడుతోంటే 'సీ యూ ఎగైన్' అంటున్నాడు సోము.

శకుంతలని చూసి వాళ్లంతా భయపడి కంగారుగా






## పుట్టిన రోజు

పారిపోయారు. సీతమ్మ భయంగా శకుంతల కేసి చూసింది.

మేడ మీదికి రమ్మని సీతమ్మకి సైగచేసి పైకి నడిచింది శకుంతల.

సీతమ్మ భయపడుతూనే పైకి వచ్చింది.

'ఏమిటే హడావిడి ?' అంది శకుంతల,

యజమానురాలి మొహంలో ప్రసన్నత చూసి సంబాళించుకుంది సీతమ్మ.

'ఇవాళ మా సీను పుట్టిన రోజండి' అంది.

శకుంతల ఒళ్లు ఝల్లుమంది.

'మీరు నెప్పులు పడుతున్నప్పుడే ముందున్న పాకలో నాకూ నెప్పులు వచ్చాయండి. మీకు డాక్టరమ్మగారు, నర్సులు వచ్చి పురుడు పోశారండి. నాకు మా అక్కయ్య వచ్చి పురుడు పోసిందండి. చిన బాబుగారు పుట్టిన టైముకి ఒక నిమిషం అటూ ఇటూగా మా సీనువాములు పుట్టాడంటండి. మా మావ చెప్పాడు' అంది.

సీతమ్మని పంపించేసింది శకుంతల.

పై అంతస్తులోకి వెళ్లింది చల్లగాలి కోసం. అక్కడే మేటన్ పై పడకుని అనంతకాశంలోకి చూస్తూ కూర్చుంది. నక్షత్రాలని దగ్గరలో నుంచి చూస్తున్నట్టు ఉంది.

మనసులో ఆలోచనలు వస్తున్నాయి. ఊహ విస్తరిస్తోంది.

సరిగ్గా అయిదు సంవత్సరాల క్రితం ఈ ఇంట్లో పుట్టమని ఇద్దరు జీవుల్ని భగవంతుడు పంపించాడు. ఇద్దరూ గేటు దగ్గరకి వచ్చాక ఒక జీవి ఆవరణలో అవుట్ హౌస్ లాగా ఉన్న పాకలోకి వెళ్లాడు! మరొక జీవి భవనంలోకి వచ్చి నోట్లో వెండి స్పూనుతో పుట్టాడు!

భగవంతుడు ఎవర్ని ఎక్కడికి పంపించాడో?

ఈ ఇంటి ఆవరణలో ఎవరు ఎక్కడికి వెళ్లాలో ఆ భగవంతుడు చెప్పింది వీళ్లు సరిగ్గా విన్నారో లేదో ? పొరపాటున తారుమారు కాలేదు గదా !

శకుంతల కళ్లలో నీళ్లు నిండాయి.

ఫోమ్ బెడ్ పై పడుకున్న శ్రీనివాస్, క్రింద చింకి చాపపై పడుకున్న సీను ఇద్దరూ తనబిడ్డల్లాగే అనిపించింది శకుంతలకి. ★






బులుసు వేంకటరమణయ్య

# ఆశ్రయ గౌరవం

యోగ్యత ఉన్నవానినే గౌరవిస్తారు. అయోగ్యుణ్ణి ఎవ్వరూ గౌరవించరు. కాని, ఆ అయోగ్యుడుకూడా కొన్ని సమయాల్లో గౌరవం పొందుతాడు. ఎప్పుడు? గౌరవం పొందుతూ ఉన్న గొప్పవారిని ఆశ్రయించి ఉన్నప్పుడు. అయోగ్యుడు ఉత్తముల ఆశ్రయం లేక తానుగా వేరే ఉన్నప్పుడు నిందలపాలవుతాడు గాని గౌరవం పొందనేపొందడు. ఈ విషయాన్నే ఒక కాకినిగురించి చెప్తున్నట్లు అన్యాపదేశంగా ఇలా ఒక కవి చక్కగా వివరించాడు.

"కర్ణారుంతుదమంతరేణ రణితం
గాహస్వ కాక! స్వయం
మాకందం మకరందశాలిన మిహ
త్వాం మన్మహే కోకిలమ్,
ధన్యాని స్థలవైభవేన కతిచిత్
వస్తూని; కస్తూరికాం
నేపాళ క్షితిపాల ఫాలపతితే
పంకే న శంకేత కః"

"ఓ కాకీ! నీవు కర్ణకఠోరంగా అరవకుండా పూవు తేనెకు నిలయమైన తియ్యమామిడి చెట్టు కొమ్మమీద ఊరికే కూర్చునివుండు. అలా కూర్చుంటే నిన్ను కోకిలవనే అనుకొని గౌరవిస్తాము. ఏమంటే-స్థలంయొక్క వైభవాన్నిబట్టి అక్కడ ఉండేవాటికి గౌరవం కలుగుతుంది, అవి చెడ్డనయినాసరే! చూడు-కస్తూరి సమృద్ధిగా లభించే నేపాళదేశంలో ఆ రాజు నుదిటిపయి మట్టి బురదపడివున్నా, అది బురద కాదనీ, కస్తూరిఅనీ అందరూ అనుకుంటారు." అని దీని అభిప్రాయం.

అంచేత – చెడ్డవాడని నలుగురిచేతనూ అనిపించుకుంటున్నా, ఉత్తముల ఆశ్రయంవల్ల మర్యాదను పొందడంకంటె, తాను ఇతరుల ఆశ్రయం అక్కరలేకుండా మంచివాడుగా ఉండి గౌరవం సంపాదించడం ఎంతో మేలుకదా!

అన్నివిధాలా ఉత్తముడుగా ఉండడానికే సర్వదా ప్రయత్నించడం మానవ ధర్మం. ★

## "డాక్టర్, మాకు ఒకరంటే ఒకరికి ఎంతో ప్రేమ, కాని..."

దిలీప్, రజని ఎంతో బెంగతో తమ కుటుంబ డాక్టర్‌ని కలుసుకున్నారు. "మేము బహుశ ఒకరికొకరం తగమనుకుంటాం డాక్టర్" అని, తన విచారాన్ని కప్పిపుచ్చుకుంటూ అన్నాడు దిలీప్. డాక్టరుగారు నెమ్మదిగా ప్రశ్నించి రజని సమస్య తెలుసుకున్నారు. విషయం ఏమిటంటే, ఆమె జననాంగం లోపల పొడిగా వుండటం వల్ల వారి దాంపత్య సంబంధానికి ఇబ్బంది కలుగుతోంది. డాక్టర్ ఇలా చెప్పారు. ఇటీవలి వరకూ ఈ అవసరానికి తగిన సాధనమేదీ ఉండేది కాదు. కాని అదృష్టవశాత్తూ ఇప్పుడు జాన్సన్ అండ్ జాన్సన్ కంపెనీ— ఈ కంపెనీ పిల్లల సంరక్షణ ఉత్పత్తులకు పేరు పొందిన కంపెనీ— ఒక ఉత్పత్తిని తయారుచేసింది. దాని పేరు కె-వై* జెల్లీ. ప్రత్యేకంగా తయారైన ఈ జెల్లీ స్వచ్ఛమైనది, తేలికగా వుండే జారుడునిచ్చేది, అచ్చం శరీరపు సహజమైన జారుడు ద్రవం లాగా ఉంటుంది. అంతేకాదు. ఇది నీటిలో కరిగిపోతుంది, పట్టుకొని కాని, జిడ్డుగా కాని ఉండదు. దీన్ని ఎంతో అనువుగా ఉపయోగించవచ్చు, సులభంగా కడిగేసుకోవచ్చు.

డాక్టర్ ఇంకా ఇలా అన్నారు. కె-వై* కెల్లీ క్రిములు లేనిది. దీని పి. హెచ్. స్థాయి (ఆమ్ల, క్షార నిష్పత్తి) మనుష్య చర్మానికి అనుగుణంగా ఉంటుంది. అంచేత, ఇది పూర్తిగా సురక్షితమైనది, దీన్ని భార్యా భర్తల్లో ఎవరైనా ఉపయోగించవచ్చు. కె-వై* జెల్లీ రాసుకోగానే, పొడిదనం పోయి మృదుత్వం వస్తుంది. ఈ జెల్లీ ఒక పల్చని పొరలాగా ఏర్పడి, సున్నితమైన చర్మాన్ని ఒరిపిడి నుంచి కాపాడుతుంది అని వివరించారు డాక్టర్. కొంతకాలం తర్వాత వారికి కె-వై* జెల్లీ ఉపయోగించవలసిన అవసరం ఉండకపోవచ్చు. అయినప్పటికీ దాంపత్య సంబంధం సంతృప్తినిచ్చేందుకు ఒక జారుడు పదార్థంగా ఈ జెల్లీని వారు ఉపయోగించడం మంచిది అని సలహా ఇచ్చారాయన.

దిలీప్, రజనిల బెంగ తీరింది. కాని వారికో అనుమానం వచ్చింది. "....మాకు పిల్లలు పుట్టడానికి ఇది ఆటంకం కలిగించదా డాక్టర్" అని అడిగారు. ఆరోగ్యమైన, చక్కని బిడ్డల్ని కనడానికి కె-వై* జెల్లీ ఎటువంటి ఆటంకం కలిగించదు అని చెప్పారు డాక్టర్.

తేలికైన మనసులతో సెలవు పుచ్చుకున్నారు ఆ దంపతులు. ఇంకొక వైవాహిక జీవితం ఇప్పుడు సుఖప్రదం కాబోతోంది.

# "డాక్టర్ మాకు ఒకరంటే ఒకరికి ఎంతో ప్రేమ, కాని..."






# కె-వై* జెల్లీ

ప్రపంచమంతటా దంపతులకోసం
డాక్టర్లు సిఫారసు చేసినది.

Johnson & Johnson



LINTAS J & J 3-2333 TL

# స్వయంకృతం

సింహం



"అబ్బ! ఈ వెధవ సిగరెట్లు మానేద్దురూ !"

లలిత కోపంగా నా చెయ్యి పట్టుకుని ఆపింది. ఆ చేతిలో సిగరెట్టుంది. ఎమర్జెన్సీలో ప్రభుత్వాధికారిలాగ వెలుగుతోంది.

"మానేస్తాను. ఇదే ఆఖరి సిగరెట్టు." అన్నాను చిన్నగా నవ్వుతూ.

"ఈ మాట ఇప్పటికి వెయ్యిసార్లన్నారు." ఉడుక్కుంది లలిత.

నిజమే! నేను చాలాసార్లు సిగరెట్లు మానెయ్యమని లలిత చేత అడిగించుకున్నాను. అన్నిసార్లూ మానేస్తానని వాగ్దానం చేసాను. కాని ఆ వాగ్దానాన్ని నిలబెట్టుకో లేకపోయాను.

పెళ్ళయిన ఈ ఆరేళ్ళలోను నేను లలితకి వాగ్దానం చేసి నెరవేర్చుకోలేకపోయినది ఒక్క ఈ సిగరెట్టు విషయంలో మాత్రమే!

ఈ విషయంలో లలిత నాతో చాలాసార్లు దెబ్బలాడింది.

"తల్లిదండ్రుల అలవాట్లు పిల్లలకి కూడా వస్తాయి. అప్పుడే మన మురళిగాడు నాన్నగారు సిగరెట్టు ఇలా కాలుస్తారు అంటూ రెండువేళ్ళు నోటి దగ్గర పెట్టుకుని ఏక్షన్ చేసి చూపిస్తున్నాడు."

నాకు నవ్వొచ్చింది. నాలుగేళ్ళ మురళి వాళ్ళ నాన్న లాగ ఏక్టు చేస్తున్నాడంటే !

"మీకు నవ్వులాటగానే వుంటుంది."

అని నా చేతిలోంచి సిగరెట్టు తీసి కిటికీలోంచి బైటకి విసిరేసింది.

లలిత తెలివితక్కువతనానికి నాకు నవ్వొచ్చింది. ఎందుకంటే వేళ్ళమధ్యనున్న సిగరెట్టు విసిరేసిందే గాని చేతిలో వున్న సిగరెట్టు పెట్టె మాత్రం లాక్కోలేదు.

లలితని మరికొంతసేపు ఆటపట్టించాలనిపించింది.

"మరి మా నాన్నగారికి సిగరెట్టు అలవాటు లేదు. నాకెందుకలవాటయింది ?"

"మీరు అలవాటు చేసుకున్నారు."

"మా నాన్నగారు అప్పుడప్పుడు మందు సేవించేవారు. అది నాకెందుకలవాటవలేదు మరి ?"

"అలవాటవకేం ? అప్పుడప్పుడు పుచ్చుకుంటూనేవున్నారు గదా !"

లలిత గొంతులో నిస్సహాయత ధ్వనించింది.

ఆ విసురు నాకు చురకలాగ తగిలింది.

నిజమేం

ఈమధ్య నేను అప్పుడప్పుడు పార్టీల పేరుతోను, పిక్నిక్కుల పేరుతోను తాగుతున్నాను.

కాని అది అలవాటు కాదు. జస్ట్ ఫర్ కంపెనీ సేక్, అంతే.

నా ఉద్యోగంలో నాకది తప్పదు మరి.

నేను ఇప్పుడు పనిచేస్తున్న కంపెనీలో మొదట్లో చాలా చిన్న ఉద్యోగంలో చేరేను.

నా తెలివితేటలతో, స్వయం కృషితో, సిన్సియారిటితో ప్రమోషన్లు సంపాదించుకున్నాను.

మెసెంజరు కేడరు నుండి అసిస్టెంటు కేడరుకి ఎదిగినప్పుడు నేనిచ్చిన పార్టీ కేవలం స్వీటు, హాటు, ఒక సిగరెట్టు — అంతే.

అప్పటి నుండీ నాకీ సిగరెట్టు అలవాటయింది.

అప్పుడే నేను లలితని పెళ్ళి చేసుకున్నాను.

లలిత చాలా బీద కుటుంబం నుండి వచ్చింది.

లలిత తండ్రి ఏదో ఉద్యోగం చేసేవాడు. కాని అతని కుటుంబం మాత్రం నేనిచ్చే ఇంటద్దెతోనే బతికేవారు. ఆ సంగతి చాలా రోజుల వరకు నాకు తెలీదు. తెలిసాక అద్దె మరో యాభై రూపాయలు ఎక్కువివ్వడం మొదలెట్టాను.

దాంతో వాళ్ళ కుటుంబానికి నాకు సాన్నిహిత్యం పెరిగింది.

అప్పుడే లలితతో నా పరిచయం కూడా పెరిగింది.

చాలా సార్లు వాళ్ళ కుటుంబానికి నేనెలా సాయపడగలనా అని ఆలోచించేవాడిని.

లలిత తల్లిదండ్రులకి ఒక్కర్తే ఆడపిల్ల. కాని లలిత తరువాత నలుగురు మగపిల్లలున్నారు. అందులో పెద్దవాడు టెంతు పాసయి రోడ్లమీద తిరుగుతున్నాడు. ఒకటి రెండుసార్లు రోడ్లమీద చీట్లపేక ఆడుతూ కన్పించాడు. ఆ సంగతి వాళ్ళమ్మగారితో చెబితే "అంతా ఆ తండ్రి లక్షణాలే అబ్బుతున్నాయి నాయనా !" అంటూ ఆవిడ నా ముందు వాపోయింది. చూస్తూ వూరుకోలేక మా కంపెనీలోనే ఉద్యోగం వేయించాను. కాని అతను దాన్ని నిలబెట్టుకోలేదు. ఉద్యోగం ఆసరాతో మరిన్ని అప్పులు చేసి మరీ పేకాట ఆడడం ప్రారంభించాడు. చేసేదిలేక ఊరుకున్నాను

అప్పుడే లలితని పెళ్ళి చేసుకోవాలనిపించింది.

లలిత చాలా నెమ్మదస్తురాలు. తెలివైనది అన్ని విధాలా నాకనుకూలవతి.

అందుకే వాళ్ళ తల్లిదండ్రులతో మాట్లాడి లలితని రిజిష్టర్డ్ మ్యారేజి చేసుకున్నాను.

ఆ విధంగా వాళ్ళ కుటుంబానికి నేను కొంత సాయపడ్డాననిపించింది.

తరువాత నాకు ప్రమోషను, దానితోబాటు ట్రాన్స్‌ఫరు కూడా వచ్చింది.

నేను మా కంపెనీ సేల్సు మానేజరును. నా ఉద్యోగరీత్యా నేను చాలామందిని కలవాలి, పరిచయాలేర్పరచుకోవాలి, స్నేహాలు పెంచుకోవాలి. ఆ సందర్భంలో వాళ్లతోబాటు అప్పుడప్పుడు తీర్థం సేవిస్తూ వుండాలి.

కాని ఆ విషయం లలితకి తెలియకుండా కొన్నాళ్లు దాచిపెట్టాను.

తెలివైన లలిత నన్నెంతోకాలం ఇబ్బంది పెట్టకుండానే తెలుసుకుంది.

తెలిసాక తల బాదుకుంది.

తన తండ్రి ఈ అలవాటుకి బానిసయే సంసారాన్ని సర్వనాశనం చేసాడని ఏడ్చింది.

# ఇవేమన పద్యాలు










నాకున్నది అలవాటు కాదని లలితకి నచ్చజెప్పటానికి నేను చాలా శ్రమపడవలసి వచ్చింది.

అక్కడి నుండి లలిత సందర్భం వచ్చినప్పుడల్లా నా అలవాట్లు ఎత్తిచూపి నన్ను ఎలర్టుచేస్తూ వుండేది.

నేను నా ఉద్యోగంలో బాగా అభివృద్ధిలోకి వస్తున్నాను.

నా ఉద్యోగ నిర్వహణలో నేను చాలా రోజులు సంసారాన్ని పట్టించుకోలేదు.

ఓ రోజు ఉదయాన్నే స్నానం చేసి వస్తూ వుంటే డ్రాయింగు రూములో మురళిగాడు సిగరెట్టు కాలుస్తూ కనబడ్డాడు. అప్పుడు వాడికి పదేళ్లు.

నేనంతకుముందు కాల్చిపారేసిన సిగరెట్టుపీకని గోడవారగా నిలబడి దమ్ము లాగేస్తున్నాడు.

వెనుకనుండి వెళ్ళి కాలరు పట్టుకున్నాను.

నన్ను చూడగానే బిక్కచచ్చిపోయాడు.

వాడిమొహం చూస్తే ఇంక దండించక్కర్లే దనిపించింది. భయంచెప్పి వదిలేసాను.

కాని ఇదంతా లలిత చూడనే చూసింది.

నామీద విరుచుకుపడింది.

నేను సౌమ్యంగా నచ్చజెప్పాను.

"చూడు లలితా! నువ్వు అనవసరంగా లేని పోనివి ఊహించుకుని భయపడిపోతున్నావు. చిన్నప్పుడు నేను మా అమ్మ దుకాణానికి వెళ్లమంటే అయిదు పైసలిస్తేగాని వెళ్లనని మారాం చేసేవాడిని. అదిచూసి మా నాన్న వీడు పెద్దయ్యాక లంచగొండి అవుతాడే అనేవాడు. అలాగని నేనిప్పుడు లంచగొండినయ్యానా! అలాగే వాడుకూడాను!"

నా సమర్థింపుని లలిత నమ్మకపోయినా మరి నాతో వాదన పెట్టుకోలేదు.

నా కృషివలన మా కంపెనీకి మంచి లాభాలు వచ్చాయి.

నేనిప్పుడు మా కంపెనీ జనరల్ మేనేజరుని.

నా జీవితంలో నేననుకున్నది సాధించాను.

మా మురళి కాలేజి మెట్లెక్కాడు.

ఓ రోజు కారులోవస్తూ చూసాను.

మురళి కాలేజి బయట ఫ్రెండ్సుతో నిలబడి వున్నాడు.

చేతిలో సిగరెట్టు వుంది.

నాకు లలిత మాటలు గుర్తుకువచ్చాయి.

కాని మురళిని దండించే వయసు దాటిపోయింది.

అందుకే కామ్‌గా ఊరుకుండిపోయాను.

నేను మా కంపెనీకి కొత్త జనరల్ మ్యానేజరుని.

జీయమ్‌గా నేను మా కంపెనీకి చెయ్యవలసినది చాలా వుంది.

ఆ సందర్భంగా ఈ మధ్య రెండు మూడు పార్టీలు ఇంట్లోనే ఇవ్వవలసి వచ్చింది.

ఇంట్లోనే పార్టీ ఇవ్వడం లలిత కెంత మాత్రం ఇష్టం లేదు.

నాకు నెమ్మదిగా తాగడం అలవాటయింది. తాగడం నా దినచర్యలో ఒక భాగమయింది. సొసైటీలో నా స్టేటసుకి తగ్గ అలవాటుగా అది ప్రకాశించిందే గాని నాకేమీ చెడ్డపేరు తేలేదు.

నా విధి నిర్వహణలో కుటుంబాన్ని పట్టించుకోకుండా వదిలి వెయ్యడం నాకు ముందు నుండే అలవాటయింది.

ఓ రోజు మధ్యాహ్నం నేను చాలా బిజీగా వున్నాను.

మా కంపెనీకి ఫారిన్ నుండి ఒక పార్టీ వచ్చింది. ఆ పార్టీతో మేమొక ఎగ్రిమెంటు కుదుర్చుకోవలసి వచ్చింది. ఆ సందర్భంగా ఆ సాయంత్రం ఊళ్ళో వున్న ఒక పెద్ద హోటలులో పార్టీ కూడా వుంది. నేనా హడావుడిలో వున్నాను.

ఇంతలో ఇంటివద్ద నుండి ఫోను వచ్చింది. నౌకరు చేసాడు.

మురళి తప్పతాగి బ్రోతల్ హౌసులో ఒక వ్యక్తిని దారుణంగా పొడిచి చంపేసాడట. ఈ హత్యలో మురళితో బాటు అతని ఫ్రెండ్సు కూడా వున్నారట.

ఆ వార్త విన్న లలిత స్పృహ తప్పి పడి పోయిందట.

నా చేతి లోంచి రిసీవరు జారి క్రింద పడి పోయింది.

అచేతనుడినయి కుర్చీలో కూలబడి పోయాను.

"పిల్లలు క్రమశిక్షణతో పెరగాలంటే ముందు పెద్దలు క్రమశిక్షణ పాటించాలండి."

లలిత మాటలు నా చెవుల్లో గింగుర్లెత్తి కర్ణభేరి బద్దలయి పోతుందేమోనన్నట్లుగా వినిపించసాగాయి.






(గత సంచిక తరువాయి)

ఇద్దరూ నడుచుకుంటూ తిన్నె సమీపానికి వొచ్చేరు. తిన్నెమీద కూర్చుని ''నిన్ను ప్రేమిస్తున్నాను. నిన్ను ప్రేమిస్తున్నాను'' అని జపం చేస్తున్న బిజ్జలుణ్ణి ''ఎవరు నాయనా నువ్వు'' అని ప్రశ్నించేడు శ్రీదేవుడు.

''నా పేరు బిజ్జలుడు. ఏకవీరను ప్రేమిస్తున్నాను.''

''మా తండ్రే. చాల శ్రమపడుతున్నావు. ఏ వూరు మనది ?''

''ఈ వూరే. వెంకన్నదొరగారి అబ్బాయిని.''

''నువ్విక్కడకు రావడం మీ నాన్న చూచేరా !''

''మా నాన్నగారే పంపించేరు.''

''ఎందుకట ?''

''ఏకవీరను ప్రేమించమన్నారు ?''

''పెళ్ళాడమన్నారా ?''

''ముందు ప్రేమించమన్నారు ? అవునూ. ఇందాకటినుండి చూస్తున్నాను. ప్రశ్నమీద ప్రశ్న వేసి విసిగిస్తున్నావు. నువ్వెవరు ?''

''నేనూ నీలాంటి పిచ్చివాడనే.''

''అయితే నువ్వూ ఏకవీరను ప్రేమిస్తున్నావా ?'' బిజ్జలుడు అడగటమయితే సూటిగా ఘాటుగానే అడిగాడు. కాని శ్రీదేవుడు సమాధానం చెప్పలేదు.

''ఏకవీరా నన్ను ప్రేమించవూ ?'' అన్నాడు బిజ్జలుడు దీనంగా ముఖంపెట్టి. యీ ప్రేమ గొడవతో ఆమెకు పిచ్చివెత్తేలా వుంది.

''అయితే బిజ్జలా ! యిందాకటినుండీ నువ్వు ఇక్కడే వున్నావా ? ఎందుకున్నావు ?'' అన్నది ఏకవీర.

''నువ్వేగా యిందాక ఆశ్రమంలోకి వెళ్తూ ''నన్నే ప్రేమిస్తూ కూర్చో'' అని చెప్పి వెళ్ళావు. అలాగే కూర్చున్నాను.'' అన్నాడు బిజ్జలుడు. ఏకవీరకు అతనిమీద జాలికలిగింది. అమాయకత్వం వల్ల అతనిలో కలిగిన ఏకాగ్రత ఆమెకు అచ్చెరువు కలిగించింది. ''బిజ్జలా! నామీద నిలిపిన ఏకాగ్రతలో పదోవంతు యీ స్వామిమీద నిలుపు. నీవు తరిస్తావు'' అంటూ చేతిలో విగ్రహాన్ని బిజ్జలునికి యిచ్చివేసింది ఏకవీర.

బిజ్జలుడు దానిని భద్రంగా అందుకున్నాడు. అది ఆమె ఎందుకిస్తోందో, దాన్ని తీసుకువెళ్ళి తాను ఏమిచెయ్యాలో బిజ్జలునికి అర్థంకాలేదు. కాని ఏకవీర యిచ్చింది కనుక తీసుకున్నాడు ఆప్యాయతతో. తీసుకుని వస్త్రాల్లో దాచుకున్నాడు.

ఈ సంఘటన శ్రీదేవునికి చికాకు కలిగించింది. ఆ మూర్తిని అతడు ఎంతో శ్రద్ధతో ఏకవీరకోసం తయారుచేశాడు. ఆమె దానిని ఎంతో సులభంగా మరోకళ్లకు యిచ్చివేస్తూవుంటే అతనికి బాధనిపించింది.

''ఏకవీరా ! ఎంతపని చేశావు ?''

''ఏమి చేశాను శ్రీదేవా ?''

''నా శ్రమను వృధా చేశావు — ''

''నీ స్వామి పూజలందుకుంటాడయ్యా.''

''అది నీ కోసం చేశాను'' అన్నాడు ఉక్రోషంలో.

''అది నా దగ్గరే ఉన్నదయ్యా.''

''సగం పిచ్చివాడికి యిచ్చేశావుగా.''

''ఆ మూర్తిని మనసులో దాచేనయ్యా'' శ్రీదేవునికి విసుగనిపించింది. కృష్ణస్వామి సూచన మేరకు ఏకవీరను దారికి తెచ్చి ఆమెను పెళ్ళాడాలన్న ఆశతో ఉన్నాడతను. కాని అందుకు అంతా విరుద్ధంగానే నడుస్తోంది. ఆలోచిస్తూనే ఆశ్రమం కేసి నడిచేడు.

''ఏకవీరా ! నేను సగం పిచ్చివాడినా ?'' బిజ్జలుడు అమాయకంగా ప్రశ్నించేడు. ఏకవీరకు జాలికలిగింది.

''పిచ్చి అంటే ఏమిటి బిజ్జలా ?''

''ఏమో నాకు తెలియదు.''

''తెలియకపోవటమే మంచిదిలే. నా స్వామి మూర్తి నీకు బాగా నచ్చిందా ? పోగొట్టుకోవు కదూ ?'' అని ప్రశ్నించింది.

''ఆఁ నాకు తెలిసింది. దీన్ని పారవేస్తే నువ్వు నన్ను ప్రేమించవు'' అంటూ ఇంటి ముఖం పట్టేడు బిజ్జలుడు.

వసారాలో సింహాసనం మీద ఉన్నాడు వెంకన్నదొర.

''బిజ్జలా చెప్పిన పని చేశావా ?'' అన్నాడు కొడుకు రాక చూచి.

''ఓ'' అన్నాడు జారిపోతున్న వేంకటేశ్వరుని విగ్రహాన్ని జాగ్రత్తగా పట్టుకుంటూ.

''వస్త్రాల్లో ఏమిటో దాచావు ? ఏమిటి నాయనా అది.''

''వేంకటేశ్వరుని విగ్రహం.''

''ఎక్కడిది ? ఎవరిచ్చారు ?''

''ఏకవీర బహూకరించింది.''

''ప్రేమ కానుకా ?''

''అవును'' అన్నాడు బిజ్జలుడు సిగ్గుతో యింట్లోకి పారిపోతూ. కొడుకు యింత ప్రయోజకుడై చెప్పిన పనిని గంటలమీద సాధించ గలిగినందుకు వెంకన్నదొర పొంగిపోయాడు. ఆయనకు భవిష్యత్తు ఆశా పూర్ణంగా కనిపించింది. ఒత్తైన మీసాలమీద చేయివేసి సవరించేడు.

## 5

ఈ పూట శివదేవయ్య తన రహస్యమందిరంలో కూర్చుని యోచిస్తున్నారు. నాలుగు అంగల దూరంలో ఒక ఉచిత ఆసనం మీద త్రిపురాంతక దేవుడు ఆసీనుడై ఉన్నాడు. అతడు ఇటీవలనే శివదేవయ్య నుండి వార్తలు తీసుకుని మొగిలిచర్లకు వెళ్లి వచ్చాడు. కృష్ణస్వామి తన సమాధానాన్ని త్రిపురాంతక దేవునికి ఇవ్వలేదు. తన నుండి వెళ్లిన లేఖను కృష్ణస్వామి చదివిన తక్షణమే శిథిలంచేశారు. అంటే దానిని తన దగ్గర వుంచుకొనటం ప్రమాదమని భావించారన్నమాట. అంతటితో తేలిపోయే విషయమేమంటే ఆయన మీద ఎవరో గూఢచారిత్వం నెరుపుతున్నారు. మొగిలిచెర్లకు కూడ జైనులు అంటించిన అగ్ని ప్రాకిందన్నమాట.

శివదేవయ్య తన మేధాసంపత్తితో యీ విషయాన్ని సులభంగానే గ్రహించారు. పైగా కృష్ణస్వామి సమాధానం త్రిపురాంతక దేవునికి యివ్వలేదు. అతనికి యివ్వటం ప్రమాదమని భావించారేమో ! అంటే ఆయన దగ్గరకు వచ్చిపోయే వారి

**జరిగిన కథ — 3 :** రుద్రాంబ, గణపతిదేవుల పరిపాలనా కాలంలో వెంకన్నదొర దగ్గర తన ఇద్దరి బిడ్డలతో వెట్టిచాకిరీ చేస్తుంటాడు హరిజనుడు నారాయణ. అతను కృష్ణస్వామి భక్తుడు. ఏకవీర కృష్ణస్వామి ఆశ్రమంలో పెరిగి పెద్దదవుతుంది. శ్రీదేవుడనే శిల్పి శ్రీ వెంకటేశ్వరుని మూర్తిని చెక్కుతాడు. ఏకవీర స్వామిని ఆరాధిస్తుంది. ఆమె శ్రీదేవుడిని ఒక చిన్న స్వామి రూపును చెక్కివ్వమని కోరుతుంది. మొగలిచర్లలో జైనాచార్యుని సభలు జరుగుతాయని తెలిసి కృష్ణస్వామి వ్యాకుల పడుతాడు. గూఢచారి త్రిపురాంతకుడు ఒక లేఖను కృష్ణస్వామికి అందచేయగా ఆయన దానిని చదివి భూస్థాపితం చేసి, మూడు తాళపత్రాలలో ఏదో వ్రాసి మహామంత్రికి ఓరుగల్లు పంపించారు. వెంకన్నదొర తన కొడుకు బిజ్జలుని పిలిచి ఏకవీరను ప్రేమించమని చెపుతాడు.

మీద కూడ నిగా ఉన్నదన్నమాట. పరిస్థితి క్లిష్ట దశలో ఉన్నది.

శాంతియజ్ఞం మొగిలిచర్లలోనే ప్రారంభించాలా ? వద్దా ? అన్న ఆలోచనలో పడ్డారు శివదేవయ్య. క్షణంసేపు ఆయన చిత్తం వికలమయింది. స్థితప్రజ్ఞుడు కనుక వెంటనే నిలువరించుకున్నాడు.

"త్రిపురాంతకా ! నీవు మొగిలిచెర్లలో ఎంతసేపు ఉన్నావు ?"

"రెండు ఘడియల కాలమే !"

"ఆ సమయంలో అక్కడి పరిస్థితులు నీకు అవగతమయ్యాయా ?"

"చాల క్లిష్టమయిన ప్రశ్న."

"పోనీ నీవు గ్రహించినది చెప్పు."

"కృష్ణస్వామి వ్యాకులంతో ఉన్నారు."

"కారణం గ్రహించావా !"

"ధర్మగ్లాని"

"అంత స్పష్టంగా ఎలా చెప్పగలవు ?"

"మరొక విషయాన్ని గురించి అయితే అన్నీ సన్యసించిన కృష్ణస్వామికి వ్యాకుల పాటెందుకు కలుగుతుంది ?"

"ఊహ మాత్రమే అన్నమాట"

"అవును. నాకు అలా అనిపించింది"

"ఆయన నుండి సమాధానం రాగలదని కూడ అనిపించిందా ?"

"నిస్సందేహంగా..." అంటూండగానే ద్వారపాలకుడు ఎవరో చారులు వచ్చారన్న వార్తను సంకేతికంగా లోపలకు అందజేశాడు. శివదేవయ్యగారి అనుజ్ఞ అయింది. వారు లోనికి వచ్చారు.

"నాయనా మీ రెచ్చటివారు" అన్నారు శివదేవయ్య. వారు చారులవలెలేరు. కేవలమీ పల్లెటూరి బయ్యన్నలవలె ఉన్నారు.

త్రిపురాంతక దేవుని దాటి వారు శివదేవయ్యకు అభిముఖంగా పోసాగేరు. వెంటనే త్రిపురాంతక దేవుడు బొమముడి వేసిన ముఖ ముద్రలో ఒక్క అంగిలో వారిని తాకి నిలువరించాడు.

వారు నిర్ఘాంతపోయి తప్పుచేసిన వారి వలె తలలు వొంచేరు.

"నాయనా మీరెచ్చటివారు ?" అన్నారు శివదేవయ్య మళ్ళీ త్రిపురాంతకుని గడసరితనానికి సంభ్రమాన్ని సూచించే కళ్ళతో చూస్తూ.

"మాది మొగిలిచెర్ల" అన్నారు ముగ్గురూ.

"వారిని వదిలివేయి నాయనా. కృష్ణస్వామి పంపేరు కాబోలు" అంటూ త్రిపురాంతకుని వారించేరు శివదేవయ్య. త్రిపురాంతకుడు తన ఆసనంమీద సుఖాసీనుడయ్యేడు.

"అవ్వును కృష్ణస్వామి పంపేరు" అన్నారు వారు ముక్తకంఠాలతో.

"ముగ్గురూ కలిసే వొచ్చేరా ?"

"లేదు. విడివిడిగా వేరువేరు దారులవెంట వొచ్చి ఏకశిలా నగరం చేరేక కలిసేము" ఈ సమాధానం విని వారు రాచమర్యాదలు తెలియని శుద్ధ జానపదులేకాక స్వభావతఃకూడ అమాయకులని గ్రహించేదు.








"అలా చేయమని కృష్ణస్వామి అనుజ్ఞ ఇచ్చేరా ?"

"అవును." ఏదో ముఖ్యమయిన సమాచారం వొచ్చిందని గ్రహించారు శివదేవయ్య మహామంత్రి.

"మీరు తెచ్చిన వార్త ఏమి" అన్నారు దవ్వంత ఆతృతతో. వారు వరుసగా తమ తమ తలపాగలలో భద్రంగా దాచిన తాళపత్రాలను తీసి యిచ్చేరు. శివదేవయ్య వాటిలో పాడి పాడి అక్షరాలను చదివి సంభ్రమంతో "త్రిపురాంతకా ! ఈ లేఖలు చూచినావా?" అన్నారు.

త్రిపురాంతకుడు ఆసనంలోనుండి చివ్వున లేచి వినయంగా నాలుగడుగులు ముందుకువేసి వొంగి ఆ తాళపత్రాలను స్వీకరించేడు. అవన్నీ పాడి అక్షరాలు. అయోమయం.

"అర్థమయిందా నాయనా !"

"క్షమించాలి. మందబుద్ధిని."

"లేఖకుణ్ణి పిలిపించు నాయనా !"

"ఆఁ" అంటూ ఆశ్చర్యంతో నోరు తెరిచేడు త్రిపురాంతకుడు.

"అవును నాయనా ! నేమా మందబుద్ధినే. కృష్ణస్వామి మహనీయుడు. మేధావి. ఆయన ముందు మనమెంత" అన్నారు శివదేవయ్యగారు. అంతటి మహామంత్రి తమ కృష్ణస్వామిని అలా ప్రశంసించటం విని ఆశ్చర్యపోయేరు జానపదులు. లేఖకుడూ కొందరు పండితులూ వొచ్చారు. అలా తాళపత్రాలను తలకొక ముక్కా యిచ్చి "అర్థమైతే చెప్పండ" అన్నారు మహామంత్రి.

పండితులు శివనామం జపిస్తూ నిలిచేరు తప్ప బదులాడలేదు. లేఖకుడు భిమాచి అయ్యేడు.

"గ్రహ గతులను పగలేమి చూడగలవు" అన్నారు కృష్ణస్వామి. లేఖకుని తల తిరిగిపోయింది. పండితులు తలలు వొంచేరు.

"మనమింత మంద బుద్ధులము కనుకనే జైనాచార్యుడు చిన్ని ఉద్యోగులనూ, జానపదులనూ ఆకర్షించగలిగేడు. ప్రభువులు మేధావులయితే చాలదు. ప్రభుత్వ యంత్రాంగము పరిశుద్ధమై, చైతన్య వంతమయినది కావాలి. అప్పుడే పాలకులకు పేరు కలుగుతుంది. పరిపాలన పరిపుష్టమయినది అవుతుంది. ఈ విషయాన్ని తెలిపేందుకే కృష్ణస్వామి యిలా చేసేరు." అంటూ మందలింపు ప్రారంభించేరు శివదేవయ్య.

## తిరుచరణాలు

నిత్యమూ తమ కళ్ళముందు కనిపించే కృష్ణస్వామి యింత గొప్పవారని తెలియగానే జానపదులు రోమాంచితులయ్యేరు. వారిని వార్తాహరులుగా నియమించబడినందుకు వ్యక్తిగతంగా ఎవరికివారే పొంగిపోయారు.

"రెండు మూడు తాళపత్రాలమీద అంకెలు ఎలా వున్నాయి ?"

"తిరగవేసి వున్నాయి."

"అంటే అంకెల వరుస క్రమాన్ని తిరుగ వెయ్యాలని సూచన. ఆ ప్రకారం ఆలోచిస్తే మూడవ తాళపత్రం మొదటిది అవుతుంది. మొదటి తాళపత్రం మూడవది అవుతుంది. రెండవది రెండవది అవుతుందికదా" అన్నారు శివదేవయ్య.

లేఖకుడూ, పండితులూ ఊపిరి పీల్చేరు. త్రిపురాంతకుడు ఏకాగ్రంగా చూపు నిలిపేడు. జానపదులు గారడీ చూస్తున్నంత సంభ్రమంతో నోరు తెరచి చూడసాగేరు.

"ఆ పద్ధతిలో ఒక్కొక్క తాళపత్రం నుండి ఒక్కొక్క అక్షరాన్ని చదవండి విషయం తేలిపోతుంది" ఆదేశించారు శివదేవయ్య. లేఖకుడు మూడు తాళపత్రాలనూ అందుకుని మూడవ తాళపత్రాన్ని మొదటిదిగానూ, మొదటి తాళపత్రాన్ని మూడవదిగానూ మిగిలిన దానిని మధ్యలోనూ పేర్చి విషయాన్ని చదువసాగేడు. విషయం ఇలా వుంది :

శ్రీ శివస్వామికి శుభాకాంక్షలతో మీరు వ్రాసిన ఉత్తరం జేరింది. జైనాచార్యుని విషయం తెలియ జేస్తాను. క్రింద కృష్ణస్వామి అని మామూలుగానే సంతకాలున్నాయి.

"చారులు అవశ్యంగా యిటువంటి పద్ధతులు నేర్చుకోవాలి నాయనా" అన్నారు శివదేవయ్య. త్రిపురాంతకుడు వినయంగా తల ఊగించేడు.

పండితులు శలవు పుచ్చుకుని వెళ్ళిపోయేరు. శివదేవయ్య అనుజ్ఞతో తన సామగ్రి తెచ్చుకుందుకు వెళ్ళేడు లేఖకుడు.

జానపదులకు పారితోషికం ప్రకటించి శలవు ఇచ్చేరాయన. వారుకూడ సంతోషంతో వెనుదిరిగి వెళ్ళిపోయారు.

ఇప్పుడా గదిలో శివదేవయ్య త్రిపురాంతకులే మిగిలేరు.

"నాయనా ! త్రిపురాంతకా ! కాకతీయ సామ్రాజ్యస్థాపన జరిగి యీనాటికి రెండువందల డెబ్బై సంవత్సరాలు దాటింది. చరిత్రలో ఇటువంటి క్లిష్టదశ యేనాడు లేదు నాయనా ! రాజ్యమంటూ ఏర్పడినాక ఆటు పోట్లు తప్పవు. కాని ఇది వైదిక ధర్మానికి జైనులు విసిరిన సవాలు. ప్రజలకు ఉండే బలహీనతలు వారికి పెట్టుబడులైనాయి. అంతటితో పెట్రేగిపోయారు. యీ స్థితికి ఒకవిధంగా గణపతిదేవులే కారణం. ఆయన జైనులను నగరంనుండి తరిమివేశారు. వారు గ్రామాలమీద పడి జానపదులతో పలుకుబడి సంపాదించుకోవటానికి యిది ఒక మేలే అయింది. ఇదీ జరిగిన పొరపాటు.

దీనిని సరిచేసుకోవటానికి ఎప్పుడు మనం అమాయకులూ, ఒక విధంగా అత్యంత మేధావులూ అయిన జానపదుల దగ్గరకు వెళ్ళాలి. వారిని ధర్మభ్రష్టులు కాకుండా కాపాడాలి. స్వధర్మం బోధించాలి. వారి దారిద్ర్యం జైనులకు ఆయుధంకాకుండా అడ్డపడాలి. ఇదీ మనముందున్న కర్తవ్యం. దీనిని సక్రమంగా నిర్వహించేందుకు అలసులూ, లంచగొండులూకాని యంత్రాంగం మనకు అవసరం. ఇప్పుడు మన బొక్కసంలో ఉన్న ధనం వారిని సంపాదించటానికి చాలదు. కాబట్టి ఏ గ్రామానికి ఆ గ్రామంలోనే యంత్రాంగం ఏర్పడేలా ఏర్పాటు చెయ్యాలి. మన కార్యక్రమం మొగిలిచర్ల గ్రామంతో ప్రారంభం అవుతుంది.

కృష్ణస్వామి శాంతి యజ్ఞకర్త. మహాదేవుడూ, పశుపతీ ఋత్విక్కులు. జానపదులలోని చైతన్యరాహిత్యాన్ని — అజ్ఞానాన్ని హోమద్రవ్యంగా కాల్చి వేయాలి. వారిని స్వధర్మం విడనాడకుండా కాపాడుకోవాలి.

అదుగో లేఖకుడుకూడా వొచ్చేశాడు. ఇప్పుడే మహాదేవునికీ, కృష్ణస్వామికీ లేఖలు వ్రాయిస్తాను. వీటిని నీవు భద్రంగా వారికి జేర్పించే ఏర్పాటు చూడు" అన్నారు శివదేవయ్య. త్రిపురాంతకుడు అంగీకారాన్ని తెలుపుకుని శలవు పుచ్చుకుని వెళ్ళేందుకు లేచాడు. శివదేవయ్య దోసిట్లో ముఖం పెట్టుకుని లేఖ చెప్తూవుంటే లేఖకుడు వ్రాయసాగాడు.

"పశుపతి మహాదేవులకు శుభ పరంపర కలిగేలా ఆశీస్సులు. నేను మహామంత్రిగా కాక సహస్రాబ్దాలుగా, శాఖోపశాఖలుగా విస్తరిల్లిన హైందవ మనేవట వృక్షంలోని ఒక రేణువుగా మీకు యీ విషయం వ్రాయ తలపెట్టాను.

## కార్టూన్లు పంపేవారికి మనవి

కార్టూన్లతోపాటు స్వంత చిరునామాగల స్టాంపులు అతికించిన కవరు పెట్టి సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వార పత్రిక, గాంధీనగరం, విజయవాడ—3. అన్న చిరునామాకి టపాలో పంపాలి. వీటి పరిశీలనకు కనీసం 6 నుంచి 8 వారాలు పట్ట వచ్చును. ఈలోగా, నేరుగా కాని, టపాలోగాని వీటిపై ఉత్తర ప్రత్యుత్తరాలకు తావు ఉండదు. కార్టూన్లు 'టపా'లో పోయినా, దారి తప్పిపోయినా సంపాదకుని బాధ్యత వుండదు. ప్రత్యేక సంచికలకు కార్టూన్లు పంపేవారు కవరుమీద ఆ సంచిక పేరు ఉదహరించాలి. ఈ కార్టూన్లకి కూడా పై నిబంధనలు వర్తిస్తాయి.

—సం.

## గాజు బుడ్డి

అసమర్థ బలహీనుడు
అబగా తన తలమీది కెత్తుకుని
కాళ్లు ఒణికిపోతూ, చేతులు కంపిస్తూ
నడుము జవజవలాడిపోతూ
మోయలేక దింపలేక ఊగిపోతున్నాడు !
వాడి తల మీదున్నది పెద్ద గాజుబుడ్డి
మరేదోకాదు — మన భూగోళం !

—సోమసుందర్

## తిరు చరణాలు

మనం జంబూ ద్వీపంలోని భరత ఖండంలో పుట్టాము కనుక యజ్ఞ యాగాలు మన బహిర్ ప్రాణాలు. మన పూర్వులు కసి తీర్చుకోవటానికి సర్పయాగం చేశారు. పిల్లలు లేకపోతే పుత్రకామేష్టి చేశారు. రాజ్యం సుస్థిరం కావాల్సివస్తే అశ్వమేధ యాగం చేశారు. దేవేంద్ర పదవిని ఆశిస్తే నూరు యజ్ఞాలు చేశారు. ఇది కర్తవ్య నిష్ఠ కావచ్చు. స్వార్థం కూడ కావచ్చు. కాని సామాన్యులు కూడ క్రతువుల్ని ప్రతిష్ఠించి హోతలయ్యారు. ఇది మన సంస్కృతి. మన సంపద. మనకు గర్వకారణం.

కార్యసిద్ధికి మనం యజ్ఞయాగాదులమీద ఆధారపడటం మామూలే. యజ్ఞమంటే కర్మే కదా నాయనా. యజ్ఞః కర్మ సముద్భవః అని గీత చెప్పటల్లేదూ. కర్మలోంచి యజ్ఞం, యజ్ఞంలోంచి మేఘమూ (వృష్టి) దానిలోనించి అన్నమూ, అనంలోంచి జీవులు పుడుతూ వున్నాయి. కర్మలోంచి ప్రభవించిన మానవుడు కర్మను అనుష్ఠించటం తప్ప అని జైనులు చెపుతున్నారు. దానికి మీకు మీరుగా సమాధానం ఇవ్వగల స్థితిలో ఉండి అలసులై ఊరుకున్నారు. ఇప్పుడు సమయం ఆసన్న మయింది. యజ్ఞమనే కర్మలో పరిశుద్ధమయిన బతుకు అనే పరమార్థాన్ని మీరు నిరూపించాలి. మీరు శాంతి యజ్ఞానికి కావలసిన ఏర్పాట్లు చూడ వలసిందని మీ మిత్రుడుగా కోరుతున్నాను. వివరాలన్నీ కృష్ణస్వామి మీకు నిర్దేశిస్తారు.'' అని ఉత్తరం ముగించారు శివదేవయ్య. దానిని చుట్టి అవతలపెట్టి మరో ఉత్తరాన్ని విప్పాడు లేఖకుడు.

''చిరయశస్కంగా వర్ధిల్లుతున్న కాకతీయ మహాసామ్రాజ్య మహామంత్రుల వారయిన శ్రీ శివదేవయ్య హైందవ ధర్మ నిష్ఠ ప్రతిష్ఠ లయిన కృష్ణస్వామికి వ్రాయు లేఖాంశములు,

ఈనాడే మైత్రి పురస్సరంగా మహాదేవ పశుపతులకు లేఖ వ్రాసినాము. ఆ లేఖను మీరు చూచి తగు చర్యలు గైకొనగలరు. ఇట్లు కాకతీయ సామ్రాజ్య మహామంత్రి శ్రీ శ్రీ శ్రీ శివదేవయ్య.

లేఖలు వ్రాయటం ముగించి లేఖకుడు వాటిని తీసుకుని త్రిపురాంతకునికి అందచేసే నిమిత్తం లేచాడు.

శివదేవయ్యగారు ఆలోచనామగ్నులయ్యారు. అరచేతులలో ముఖం అలాగే వుంది. తక్షణమే వెళ్ళి త్రిపురాంతకుని ''మొగిలిచర్లకు పంపు'' అన్నారు తలఎత్తి చూడకుండానే.

ఆ లేఖను చూసుకుని మహాదేవ పశుపతు లిద్దరూ పొంగిపోయారు. వారి ఆనందం అర్ణవమే అయింది.

''విన్నావా పశుపతీ! మహామంత్రుల వారు మైత్రి పురస్కారంగా రాసిన లేఖ యిది'' అన్నాడు మహాదేవుడు.

''వినలేదు మహాదేవా ! చదివాను. చదివింది నేను విన్నది నువ్వు. ఇంతలోనే ఒళ్లు మరచేవా నాయనా'' అన్నాడు పశుపతి.

వారిది విచిత్రమైత్రి. ఒక విధంగా గురు శిష్య సంబంధమే వారి మధ్య ఉన్నది కాని ఒక్కటే చిక్కు. ఎవరు గురువో ఎవరు శిష్యుడో కొన్ని సంవత్సరాల వింటే వారికి తేలలేదు.

వారిద్దరిలో ఎవరు ఏ క్రొత్త విషయాన్ని నేర్చుకున్నా రెండవ వారికి చెప్పటం, ఆ రెండవ వారు శ్రద్ధగావిని నేర్చుకోవటం అలవాటు వారికి. కాబట్టే ఒకప్పుడు ఒకరూ, మరొకప్పుడు మరొకరూ గురువు అవుతారు. అలాగే ఒకప్పుడు వీరూ, మరొకప్పుడు వారూ శిష్యుడు అవుతారు. అది కాబట్టే వారిది విచిత్ర మైత్రి అని చెప్పుకోవచ్చు.

ఆ పల్లెటూరి బ్రాహ్మణ జంటకు తీరిక ఎక్కువ. నిత్యానుష్ఠానాలు భోజనాలు పూర్తి కాగానే నిద్రపోవటమో, పూజా విధానాలూ, అభిషేకాలూ, శాస్త్ర విషయాల మీద చర్చిస్తూ కూర్చోవటమో వారి పని. కేవలం పల్లెటూరి ఛాందసాలకు అలవాటుపడి అలాగ అయ్యారేకాని వస్తుతః పండితులే.

అప్పుడప్పుడూ పశుపతి అయిపుణ్ అంటే మహాదేవుడు వెంటనే 'హయవరట్' అనటమూ జరుగుతూనే ఉంటుంది. వాళ్ళిద్దరూ పాణిని వ్యాకరణ సూత్రాల సముద్రంలోకి దిగటానికి అదే రేవు పట్టణం.

ఒకరు 'ఢఢదన్' మరొకరు 'జభఘడదన్' అంటారు. ఆ సూత్రాలుచెప్పేటప్పుడు లయబద్ధంగా ఊగే ముండితమైన శిరస్సులూ, వెనుక ఆ గోష్పాద మంత శిఖలూ అది చేసే నాట్యమూ చూడాలేకాని వర్ణిస్తే తీరదు.

సూత్రాలు చెప్పేటప్పుడు; ఆ విషయాలు విమర్శించేటప్పుడూ అంత ఆత్మీయంగా భావించుకుని మగ్నత పొందుతారు.

''అయితే శాంతి యజ్ఞానికి నీవు ఋత్విక్కువా ?''

''నేనేమిటి ఖర్మ నీవు కూడా''

''ఒక యజ్ఞానికి యిద్దరు పశిష్ఠులా ? శాస్త్ర సమ్మతమేనా ?''

''ఏమో ఆ కృష్ణస్వామినే అడిగితే పోలా ?''

''అదే సరయిన దారి'' అంటూ ఇద్దరూ బయల్దేరి కృష్ణస్వామి ఆశ్రమం మీదికి వొచ్చి పడ్డారు ఒక్క ఊపున.

''అయ్యా నమస్కారం ఒక యజ్ఞమునకు ఇద్దరు ఋత్విక్కులు ఉండవచ్చునా?'' అన్నాడు పశుపతి కృష్ణస్వామిని చూస్తూనే.

కృష్ణస్వామి ఆ పండితులిద్దర్నీ సాదరంగా గౌరవపురస్సరంగా ఆహ్వానించి ఆశీస్సుల్ని చేశారు.

"ఒకే యజ్ఞమునకు ఇద్దరు ఋత్విక్కు లుండవచ్చునా ?" అన్నాడు మహాదేవుడు మహా విస్మర్షగా.

"చెప్పండి స్వామీ" అన్నాడు పశుపతి కృష్ణ స్వామి నోరు తెరిచేలోగానే చాలా తొందరపడిపోతూ.

కృష్ణస్వామికి తెలుసు. ఆలోచించవలసిన విషయం ఇదికాదనీ శాంతి యజ్ఞాన్ని జయప్రదం చేయటానికి ఎదురయ్యే అడ్డంకుల్ని గురించి ఆలోచించాలనీ; ఆ విషయాల్ని వొదిలేసి అనవసర విషయంమీద వీళ్ళు గుద్దులాడుకుంటున్నారు. ఉండదగునంటే ఇద్దరూ ఉండొచ్చు. అక్కర లేదంటే ఒక్కరే ఉండొచ్చు. దాన్లో పెద్ద విషయం ఏముంది. అయినా అది యజ్ఞం ప్రారంభమయ్యే సమయంలో ఆలోచించవలసిన విషయం. వీళ్ళ ఇప్పటినుండే దాని గురించి గుద్దులాడుకోవటం దేనికి ?

"నాయనా ! యజ్ఞమంటే మాటలా?"

"కాదు. కాదు" అన్నారు పండితులు ఇద్దరూ ముక్త కంఠంతో.

అంతలో పశుపతికి ఒక ధర్మ సందేహం వచ్చింది మళ్ళీ.

"అయ్యా ! మహామాత్రులవారి లేఖ తమకూ వొచ్చింది కదా ! ఏమని వ్రాశారు" అన్నాడు ఎంతో ఆసక్తితో.

"వొచ్చింది నాయనా ! మహామంత్రిగా నన్ను ఆజ్ఞాపించారు."

"మాకు మైత్రీ భావంతో వ్రాస్తున్నామని వ్రాసినారే."

"అలాగా !" ఆలోచనలో మునిగేరు కృష్ణ స్వామి. ఆయన ఆలోచనలు ఆయనకే వొదిలేసి యీ యిద్దరూ మళ్ళీ దెబ్బలాడుకోవటం ప్రారంభించేరు ఒకరికంటే ఒకరు మించిపోయి.

"పశుపతీ ! యీ తేడా ఎందుకు చూపా రంటావు."

"పొరపాటయి వుంటుంది."

"మహామంత్రి ఇంత చిన్న విషయంలో పొరపాటు చేస్తారా ?"

"గ్రహపాటయి వుంటుంది."

"నా బొంద. సరిగా చెప్పవయ్యా బాబూ?"

"పొరపాటులో గ్రహపాటు అయివుంటుంది."

"అదీ నిజమే ! ఎందుకు కాకూడదు."

"నిన్ను పలకరించటం నాదే బుద్ధి తక్కువ."

"నాకు అసలు బుద్ధనేది ఉంటే ఇంత దూరం నీతో వొస్తానా?"

"నాతో నువ్వొచ్చావా ? ఎంత అబద్ధం. నీతోనే నేను వొచ్చాను."

"అడుగు కృష్ణస్వామిని."

"అడుగు"

"అడుగు — నువ్వే."

"నేను అడగను."

"నేనూ అడగను."

"అయితే మానెయ్యి."

"నువ్వూ మానెయ్యి."

"త్వం శుంఠ" అన్నాడు పశుపతి కోపంగా.

"త్వమసి శుంఠ" అన్నాడు మహాదేవుడు తగ్గిపోకుండా.

"నాయనా పండితులు తమలోతాము కలహించు కోకండి" అన్నారు కృష్ణస్వామి యీ గంద్రగోళం విని తలఎత్తి చూస్తూ.

"స్వామీ ఒకే విషయంమీద సందేహం వొచ్చినప్పుడు తర్కించుకోకుండా ఎలా తేలుతుంది" అన్నాడు పశుపతి ప్రశాంతపడిపోతూ.

"మీరు చేసేది తర్కమా ? తగవులాటా ?" అన్నారు కృష్ణస్వామి పశుపతి ప్రశాంతత చూసి ఆశ్చర్యపోతూ.

"తర్కమంటే ఒక విషయాన్ని గురించి తగవులాడుకోవటమేకద స్వామీ" అంటూ సమర్ధించేడు మహాదేవుడు.

వీళ్ళ ధరువుచూచి ఆశ్చర్యమనిపించింది కృష్ణ స్వామికి. వాళ్ళు అలా అలవాటుపడిపోయారనీ, అందులో పట్టించుకోవలసింది ఏమీ వుండదనీ గ్రహించేరాయన.

"నాయనా ! శాంతియజ్ఞానికి కావలసిన ధనం ఆంధ్ర సామ్రాజ్య కోశాగారంనుండి వస్తుంది మనకు."

"ఎలా తెలుసు మీకు ?" అన్నారిద్దరూ ముక్త కంఠంతో.

"నాకు అధికారం హోదాలో ఉత్తరం వ్రాయటంలో పరమార్ధం అదే నాయనా. కాని యీ విషయం మరెవ్వరికీ తెలయకూడదు."

"అలాగే. కాని; ఎందుకని — ?"

"జైనుల ఆచార్యుడు జరుపబోయే మహాసభకు వెంకన్నదొర నిధులు సమకూర్చుకోవటానికి ప్రజల మీద ఆధారపడుతాడు. మనం ఆ పొరపాటు చెయ్య కూడదని ఆయన అభిప్రాయం అయివుంటుంది. సరే. నేను కబురు పెట్టేవరకూ మీరు ఇక్కడకు రాకూడదు. అవుసరమయినప్పుడు తెలియచేస్తాను. సరా !" అంటూ లేచారు కృష్ణస్వామి.

ఆయన లేవగానే తమకుకూడ శలవు దొరికిం దని గ్రహించారు పండితులు. వెంటనే లేచి కృష్ణ స్వామి దగ్గర శలవు పుచ్చుకుని ఇంటిముఖంగా వెళ్ళిపోయారు.

దారిపొడవునా వాళ్ళు ఏదో విషయంమీద చర్చి స్తూనే వెళ్ళారుకాని, అది తేలకుండా ఇళ్ళదగ్గరకు వొచ్చేశారు. ఎవరిదారి వారిదయింది.

## 6

బిజ్జలునికి పెండ్లి యీడొచ్చింది. పెండ్లి కళ కూడా వచ్చింది మధ్య. అతనికి అలంకారాల మీద మోజు పెరిగింది. అంచులు దీటుగా కన్పించే లాగ ధోవతులు కట్టడం నేర్చాడు. ఉష్ణీషం రవంత వదులుగా కుచ్చులు వ్రేలాడేలా కట్టడం కూడ నేర్చాడు.

కళ్ళల్లో మెరుపు హెచ్చింది. పరధ్యానమూ హెచ్చింది. కారణం లేకుండానే నవ్వటం, అనవసర మైన విషయాలలో పాల్గొనటం మానివేస్తున్నాడు. కొంతలో కొంత గాంభీర్యం కూడ అలవడుతుందన్న మాట; మార్పులు కొట్టవచ్చినట్లు కన్పిస్తున్నాయి.

అతనికి వివాహం చేయాల్సిన సమయం వొచ్చింది. కాని రాజకీయాలు యింకా దారికి రాలేదు. కారణాంతరాలవల్ల బిజ్జలుడిని ఏకవీర ప్రేమలో పడేలా చేయాల్సి వొచ్చింది. వాస్తవానికి కులం తెలియని ఆ పిల్లతో వివాహం వెంకన్నదొరకు సమ్మతం కాదు. బిజ్జలునికి తమ కుమార్తెల్ని యిచ్చేందుకు వెలమదొరలు చాలమందే ముందుకు వచ్చేరు.

వెంకన్నదొరకున్న పలుకుబడి వారిమీద పని చేసి ఆకర్షిస్తోంది. కాని ఆయన ఇంకా ఎవరికీ మాట యివ్వలేదు. కారణం రాజకీయాల స్థితి. తాను అనవసరంగా బయటపడాల్సి వొస్తోంది. ఇవి ఒక స్థాయికి తెచ్చుకోవాలి.

కృష్ణస్వామి తనకు లొంగి వచ్చేలా ఉండాలంటే బిజ్జలుడు అవివాహితుడుగానే ఉండాలి. ఏకవీరను

తన కోడలుగా స్వీకరించేందుకు యిష్టం ఉన్నట్టుగా నటించాలి.

జైనాచార్యుడు తలపెట్టిన జైన మహాసభలు దిగ్విజయంగా ముగిస్తే ఆ తరువాత తన యిష్టం.

తనకు అండ ఏర్పడుతుంది. తన జోలికి రావటానికి రాణిరుద్రాంబకు సంకోచమేర్పడుతుంది. యీ స్థితిలో తాను బయటపడిపోయి ఏ అండా లేకుండానే ఉండిపోతే తనంటే ప్రభుత్వానికి లక్ష్యం ఉండదు. తనను ఏదయినా చేస్తే పట్టించుకునే దిక్కూ ఉండదు. కనుక బిజ్జలుడిని ప్రయోగించి కృష్ణస్వామిని లొంగదీసుకు రావటం తన ముందున్న ప్రథమ కర్తవ్యం. ఈ ఆటలో ఏకవీర ఒక పావు.

"ఏకవీర నీకిచ్చిన ప్రేమ బహుమానాన్ని జాగ్రత్తగా దాచేవా ?" బిజ్జలుడిని బుజ్జగిస్తున్నట్టుగా ప్రశ్నించేడు దొర.

"అవును నాన్నగారూ ! సీతాదేవి సుగ్రీవుడిచ్చిన అంగులీయకాన్ని దాచుకున్నంత భద్రంగా దాచాను" అన్నాడు శకారుడి తమ్ముడే తాను అనిపించేలా.

"తప్పు నాయనా ! సీతాదేవికి అంగుళప్రదానం చేసింది సుగ్రీవుడు కాదు. ఆంజనేయస్వామి" వెంకన్నదొర సవరించేడు.

"ఎవరైతేనేమి. రెండూ కోతులేగా" అన్నాడు బిజ్జలుడు.

"నాయనా ! చెప్పానుకదా ! ఏకవీర నీ కోసం

## తిరుచరణాలు

వెతుకుతూ రావాలి. అప్పుడు నీ మగపోడిమి ఏమిటో తెలుస్తుంది. నువ్వే ఆమె చుట్టూ తిరిగావనుకో ! నీవు లోకువ అయిపోతావు. తెలిసిందా?" అన్నాడు వెంకన్నదొర.

"తెలిసింది నాన్నగారూ ! కాని ఏకవీర ఎప్పుడొస్తుంది" అన్నాడు బిజ్జలుడు. దానికి సమాధానం వెంకన్నదొర ఏమని చెప్పగలడు. ఏకవీరను గురించి తానూ కర్ణాకర్ణిగా విని ఉన్నాడు. ఆమె సాక్షాత్తు శ్రీ వేంకటేశ్వరుని మూర్తినే ఆరాధిస్తోందట. ప్రేమిస్తోందట. ఇది ఏమి విపరీతమో !

ఆ రాతి బొమ్మ ఏకవీరను వివాహమాడుతుందా ? రానురాను హిందువులకు మతిపోతున్నది. వారి భావుకత శృతిమించి అపస్వరాన పడుతున్నది.

లేకపోతే రాతి బొమ్మను యీ ముద్దుగుమ్మ ప్రేమించటం ఏమిటో ! యీవిడ అపర మీరాబాయి కాబోలు.

ఆయనకు కాశ్మీర వైష్ణవి లల్ల జ్ఞాపకానికొచ్చింది. ఆవిడా మీరాబాయిలాగే తన్మయ భావుకురాలట. కృష్ణుడి మూర్తిని ప్రేమించి జీవితాన్ని అంకితం చేసిందట.

ఈ ఆడవాళ్ళకు ప్రేమపిచ్చి మరీ ఎక్కువ. ఆరాధన అంటే రాతి బొమ్మలకు జీవితాలను అంకితమివ్వటమేనా !

అదే అయితే అదొక పిచ్చిగా భావించవచ్చు. జైనులు ఆలోచించినంతగా వస్తుతాదర్శనం హిందువులకు లేదు కాబోలు.

తామూ యింతకు ముందువరకూ హిందువే. తనలో ప్రవహించేది హిందూ రక్తమే !

ఆత్మార్పణవల్ల పోగొట్టుకునేదానికన్న లభించేదే ఎక్కువ అని తన మనసుకూ అనిపిస్తున్నది. కాని యీ అంతరంగమనేది మనిషిని మోసం చెయ్యదన్న నమ్మకం ఏమిటి ?

వెంకన్నదొర మనసులో గుంజాటన ప్రారంభం అయింది. తాను జైనంవైపు మొగ్గేడు. వెనుకడుగు వేయటం పిరికితనం. హైందవ ధర్మంలో అన్ని మతాల సారాంశాలూ కన్పిస్తాయి.. అదిదానిలో ఉన్న యింద్రజాల గుణం. దాని గురించి తాను లొంగిపోయాడో ! ఇక తిరోగమనమే !

ఏకవీర తనే వెదుకుతూ బిజ్జలుని కోసం వస్తుందని హామీ యిచ్చాడతను. కాని ఆమె వస్తుందన్న నమ్మకం ఏమిటి ? రాకపోతే యీ బిజ్జలుడికి ఘడియ ఘడియకు ఏమి సమాధానం చెప్పి ఆపగలడు తను. అతడేమో ఉరకలు పరుగుల మీద ఉన్నాడు.

వెంకన్నదొర సంశయంలో పడిపోయాడు. ఆయన అదృష్టం పండినట్లుగా ఏకవీర వస్తూ కనిపించింది.

[ఇంకా వుంది]

ARUN

# చలివేంద్రం


మంచినీళ్ళు కావాలంటే అలా చలివేంద్రం లోకి పోయి తాగరాదూ? అస్తమానం నన్ను విసిగించక పోతే!!
చలివేంద్ర


'చలివేంద్రం' పెట్టడానికి ఎక్కడా చోటు దొరకలేదయ్యా నీకూ? ఆఁ!
చలివేంద్రం
కూల్‌డ్రింక్


మన చలివేంద్రం ఎదురుగా ఆ ప్రతిపక్షం వాళ్ళు కూడా ఓ చలివేంద్రం పెట్టి పంచదార నీళ్ళు పోస్తున్నారండి..... ఏం చేద్దాం...?....


తాగినట్టే తాగి... గ్లాసులు ఎత్తుకు పోతున్నారు- అందుకనీ........


తెలుగుదేశం చలివేంద్రం


ఇంతకీ అందులో తాగుదాం అంటారా? ఇందులో తాగనీమంటారా?....
పార్టీఫిరాయింపుదారులు


కాంగ్రెస్ (ఐ) చలివేంద్రం
ARUN



'మగ మహారాజ' చిరంజీవితో సుహాసిని

## అభినయ మూవీస్ "సమాధానం కావాలి"

"ఒక కొత్త హీరోను, అనితారెడ్డి అనే కొత్త గాయనిని పరిచయం చేస్తున్నాం," అన్నారు పై చిత్రాన్ని సమర్పించే ఏలూరి దుర్గాప్రసాద్. చక్రవర్తి స్వరకల్పనలో అనితారెడ్డి పాడిన డిస్కో పాటను మార్చి 23న రికార్డు చేశారు. తులసి, గొల్లపూడి మారుతీరావు, బాలాజీ, వీరభద్రరావు ప్రభృతులు ప్రధాన భూమికలు నిర్వహిస్తారు. ఐ. ఎన్. గిరి సంభాషణలు, వేటూరి గీతాలు, కె. ఎస్. ప్రసాద్ ఛాయ, రంగారావు శిల్పం, గౌతం రాజు కూర్పు, ప్రసాద్ ప్రొడక్షన్, బి. ఎస్. రెడ్డి సహకార దర్శకత్వంతో పి. శివాజి, వై. రామ కృష్ణారెడ్డి నిర్వహణ బాధ్యతలు వహిస్తున్నారు.

గుంటూరు, నాగార్జున ప్రాంతాలలో ఇరవై అయిదు రోజులపాటు ఏకబిగిన షూటింగ్ పూర్తి చేశామని నిర్మాతలు జె. అక్కిరెడ్డి, జి. తిరుపతిరావు తెలిపారు. ఈ చిత్రానికి ఎన్. రవీంద్రరెడ్డి కథ, స్క్రీన్ ప్లే సమకూర్చి, దర్శకత్వం వహిస్తున్నారు.

## "చింతామణి" చిత్రంలో పాత్రలు, పాత్రధారులు

భవానీ శంకరుడుగా శోభన్ బాబు, బిళ్వ మంగళుడుగా మోహన్ బాబు, చింతామణిగా శ్రీదేవి, సుబ్బి శెట్టిగా తాను నటిస్తున్నట్లు దర్శక రచయిత దాసరి నారాయణరావు చెప్పారు. తారకప్రభు ఫిలిమ్స్ పతాకంలో ఈ చిత్రం వచ్చే సంవత్సరారంభంలో సెట్స్‌కు వెళ్తుంది.

'పల్లెటూరి పిడుగు' మోహన్‌బాబుతో కవిత



## మగమహారాజులో మగరాయుడు

(నూతన్) ప్రసాద్, తన భార్య సావిత్రి (కె. విజయ)తో మామగారింటి దగ్గరికి చేరుకునే సరికి హాల్లో సందడిగా ఉంది. "ఏంటి, హాలంతా ప్రేక్షకులతో నిండిపోయిందేమిటి ? కొంపతీసి, సరస్వతికేమన్నా పెళ్ళి చూపులా ?" అని అడిగాడు.

రాఘవయ్య (ఉదయకుమార్) సంతోషంతో "అవును, బావా," అన్నాడు.

"బాగుంది. మొదటి సినిమా రిలీజు కాకుండా రెండో సినిమాకు ముహూర్తం పెట్టాట్ట – వెనకటికెవడో నీలాంటివాడే. ఇప్పటికి నా పెళ్ళయి ఐదు సంవత్సరాల మూణ్ణెల్ల రెండు రోజులయింది. ఇంతవరకు నా కట్నానికి దిక్కులేదు. దానికి పెళ్ళా? అంటే, రేపటి నుంచి దాని మొగుడు కూడా కట్నం కోసం నీ ఇంటి చుట్టూ తిరుగుతూ కూర్చోవాలా ? మా నాన్న – కట్నమో, కట్నమో – అని ఫైర్ చేస్తున్నాడు నన్ను."

"గొడవ దేనికి బాబూ పెద్ద మనుషుల ముందు ?"

"కట్నమెగ్గొట్టిన నువ్వో పెద్దమనిషి. నీ కూతుర్ని చేసుకోవటానికి ఆయనొక పెద్దమనిషి. మధ్యలో నేను లోఫర్‌గాడ్ని. అవునసలు ఏడా పెళ్ళి కొడుకు తండ్రి ? ఏం బావుకుందామని వచ్చా డిక్కడికి ?"



# సినిమా

ఇంతలో రాజా (చిరంజీవి) వచ్చి, "ఇష్టం గొడవ చెయ్యకు," అన్నాడు.

"నా కట్నం డబ్బు నేనడగడం గొడవగా ఉందా ?" అన్నాడు ప్రసాద్.

"మర్యాద లేకుండా మాట్లాడావో ..." అని రాజా అనేసరికి ప్రసాద్ చివాలున రాఘవయ్య వంక తిరిగి, "నువ్వు తిట్టలేక నీ కొడుకుచేత తిట్టిస్తున్నావా ?" అన్నాడు.

రాఘవయ్య ఎంతో వినయంతో అన్నాడు : "అది కాదు, బావా ! కుర్రాడు ఏదో ఆవేశంలో..."

"అంటే ? వాడు కుర్రాడు నేను ముసలాడ్ననా ? ముసలాడికి కట్నం ఇచ్చేది ఏంటనా? ఏంటి నా కట్నంకాడ మీ గొడవ ?" అని రెచ్చిపోయిన ప్రసాద్, లోపల్నించి సరస్వతి పాట వినగానే చప్పబడిపోయాడు.

విజయబాపినీడు స్క్రీన్ ప్లే, దర్శకత్వంలో మాగంటి రవీంద్రనాథ్ చౌదరి నిర్మించే శ్యాంప్రసాద్ ఆర్ట్స్ "మగమహారాజ" చిత్రంలో సుహాసిని, రావు గోపాలరావు, బాలాజీ, రాళ్ళపల్లి, తులసి, రోహిణి, అన్నపూర్ణ, నిర్మల, జయమాలిని ఇతర పాత్రధారులు.

## ఊటీలో "రామరాజ్యంలో భీమరాజు"

"మే 6 నుండి 11 వరకు మద్రాసులో, మే 12 నుండి 22 వరకు ఊటీలో కృష్ణ, శ్రీదేవి మీద నాలుగు పాటలు, కొన్ని ముఖ్యమైన సీన్‌లు షూట్ చేస్తాం. జూన్ మొదటివారంలో మిగతా పాచ్ వర్క్‌ను పూర్తిచేసి, ఆ నెలలోనే రిలీజ్ చేయాలనుకుంటున్నాం", అన్నారు మిద్దె రామారావు. ఈయన శ్రీ రాజలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్ పతాకంలో నిర్మించే పై చిత్రం మార్చి 12 నుండి 31 వరకు జరిగిన రెండవ షెడ్యూల్‌తో సగానికి పైగా పూర్తయింది. చంద్రమోహన్, సంగీత, జగ్గయ్య, సత్యనారాయణ, రావు గోపాలరావు, అల్లు రామలింగయ్య, శివరంజని, రాజేంద్రప్రసాద్, వీరభద్రరావు, వేలు తక్కిన నటవర్గం. వసుంధర కథకు సత్యానంద్ సంభాషణలకర్త. వెంకట్ ఛాయ, చక్రవర్తి సంగీతం, సాయికుమార్ శిల్పం, డి. వెంకటరత్నం కూర్పు, శరత్ సహ దర్శకత్వం, ఎన్. వెంకటేశ్వరరావు ప్రొడక్షన్, ఫుల్లారావ్ సహకార దర్శకత్వంతో కె. ఎల్. ఎన్. శాస్త్రి ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్. "మొదటి నుంచి చివరి దాకా కడుపుబ్బ నవ్వించే చిత్రం" అన్నారు స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించే ఎ. కోదండరామిరెడ్డి.



'రామరాజ్యంలో భీమరాజు' చంద్రమోహన్‌తో సంగీత

# విశేషాలు

-జి. వి. జి.

## వెంకన్నబాబు "ఊహాసుందరి"కి కొత్త దర్శకుడు

"టీన్ ఏజ్ లవ్ స్టోరీ. పడుచు గుండెల్లో చెలరేగే రాగానుబంధాలకు, సంఘర్షణకు, త్యాగానికి ప్రతీకగా విలక్షణమైన కథాసంవిధానంగల చిత్రం", అన్నారు ఎస్. పి. వెంకన్నబాబు. ఈయన మహేశ్వరి ఆర్ట్ మూవీస్ పతాకంలో నిర్మించే "ఊహాసుందరి" చిత్రం ద్వారా ప్రత్యగాత్మ, వాసు, కోదండరామిరెడ్డి ప్రభృతుల వద్ద తొమ్మిదేళ్లకు పైగా దర్శకత్వ శాఖలో అనుభవం గడించిన అనిల్ కుమార్‌ను డైరెక్టర్‌గా పరిచయం చేస్తున్నారు. ఉగాది నాడు తొలిగీతం ధ్వనిముద్రితమైంది. నరేష్, శుభాకర్, తులసి, నళిని, రావుగోపాలరావు, అల్లు రామలింగయ్య వేలు ముఖ్యపాత్రధారులు దర్శకుడు సమకూర్చిన కథ, స్క్రీన్‌ప్లేకు సత్యానంద్ సంభాషణలు రాస్తున్నారు. వేటూరి గీతాలకు చక్రవర్తి బాణీలు కూర్చారు. నవకాంత్ ఛాయ, విజయకుమార్ శిల్పం, డి. వెంకటరత్నం కూర్పుతో నిర్మాణ సారథ్యం వహించే జయరామారావు "మే 15 నుంచి షూటింగ్ విశాఖపట్నంలో ఒకే షెడ్యూల్లో పూర్తవుతుంది" అన్నారు.

## తూర్పు తెల్లారింది

టి. కాంతారావు, బి. రాజమల్లు నిర్మించే క్రాంతిరాజ్ కంబైన్స్ వారి "తూర్పు తెల్లారింది" చిత్రం షూటింగ్ మార్చి 24న మొదలైంది. గౌరి, ప్రభాకరరెడ్డి, కాకరాల, రాళ్ళపల్లి, నారాయణమూర్తి, పి. వి. చలం, తారాకృష్ణ, మల్లేష్, ప్రతిభ, బాలామణి, స్నేహశీల వగైరా నటవర్గం. గోపాలకృష్ణ సంగీతం, జనార్దన్ ఛాయ, మధు కూర్పు, ప్రకాశరావు సహదర్శకత్వం, మనోహర్ నిర్మాణ సారథ్యం, సూర్యనారాయణ ప్రొడక్షన్స్ నిర్వహిస్తున్నారు. "ఏప్రిల్ మూడవ వారం నుంచి కరీంనగర్ జిల్లాలోని గ్రామ ప్రాంతాల్లో ఇరవై రోజులపాటు జరిగే షెడ్యూల్‌తో మొత్తం షూటింగ్ పూర్తయిపోతుంది," అన్నారు ఈ చిత్రానికి కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, దర్శకత్వం వహించే కొక్కుం భాస్కర్. ఈయన లోగడ చైతన్యవంతమైన నాటకాలను రచించి, తెలంగాణాలోని పలు ప్రాంతాల్లో స్వీయ దర్శకత్వంతో ప్రదర్శించి ప్రశంసాపాత్రులయ్యారు.

## సత్యచిత్రవారి చిత్రంలో కృష్ణ హీరో

నిర్మాతలు సత్యనారాయణ, సూర్యనారాయణ త్వరలో ప్రారంభించే చిత్రంలో కృష్ణ కథానాయకుడు. కె. బాపయ్య దర్శకుడు.

'అగ్నిజ్వాల'లో నరేష్, అరుణ





మనోభావాలకు అందమైన భాషలు ఎన్నెన్నో.
దులో విమల్ ఒకటి.

## మాదాల "స్వరాజ్యం" ఏప్రిల్ 12న ప్రారంభం

"తెలుగుజాతి గర్వించే విప్లవ వీరుడు అల్లూరి సీతారామరాజుకు మా చిత్రం అంకితం ఇవ్వబడుతుంది," అన్నారు మాదాల రంగారావు. ఈయన కథ, నిర్మాణ సారథ్యంలో నవతరం ప్రొడక్షన్స్ తయారుచేసే "స్వరాజ్యం" చిత్రం ఏప్రిల్ 12 నుంచి ఒకే షెడ్యూల్లో పూర్తవుతుంది. కాగడా శర్మ సంభాషణలు, చక్రవర్తి సంగీతం, ఆర్. రామారావు ఛాయ, ఉర్ఫి శిల్పం, సి.హెచ్. సుబ్బారావు కూర్పుతో దర్శకత్వ సారథ్యాన్ని నవతరం యూనిట్ వహిస్తోంది. మాదాల రంగారావు, సంగీత దర్శకుడు చక్రవర్తి ఆదిగా గలవారు పాల్గొంటున్నారు.

## "ఇద్దరు దొంగలు" గా కృష్ణ, శోభన్‌బాబు

"శోభన్‌బాబు పక్కన జయసుధ, కృష్ణ పక్కన రాధ నాయికలు. శారద మరో ముఖ్యమైన భూమికను ధరిస్తుంది", అన్నారు డైరెక్టర్ కె. రాఘవేంద్రరావు. రమా ఫిలివ్స్ పతాకంలో కైకాల సత్యనారాయణ నటిస్తూ, సమర్పించే "ఇద్దరు దొంగలు" చిత్రంలో ప్రభాకరరెడ్డి, రావుగోపాలరావు, గిరిబాబు, అల్లు రామలింగయ్య, నాగేష్ ఆదిగాగలవారుంటారు. ఉగాది నాడు పాటల రికార్డింగ్‌తో ప్రారంభోత్సవం జరిగింది. సత్యానంద్ మాటలు, చక్రవర్తి సంగీతం, కె. ఎస్ ప్రకాష్ ఛాయ, కె. నాగేశ్వరరావు కూర్పు, భాస్కరరాజు శిల్పంతో ఈ చిత్రాన్ని నిర్మించే కైకాల నాగేశ్వరరావు "జూన్ 1న షూటింగ్ మొదలెట్టి, విజయదశమి కానుకగా విడుదల చేయాలనుకుంటున్నాం" అన్నారు.



"పిచ్చిది కాదు! ఇవాళే విడుదలైన కొత్త సినిమాకి వెళ్లి వచ్చినట్టుంది!"





అక్కినేని, జయప్రద 'అమరజీవి'లో

## సినిమా

### సమోదు చేయబడిన చిత్రాల పేర్లు

శ్రీ చరణ్ ఫిలివ్స్ "అల్లుడుగారి అగచాట్లు", తాజ్ పిక్చర్స్ "తాళికట్టిన భార్య", శ్రీ ఫిలివ్స్ ఇంటర్నేషనల్ "మాతా పితా గురుదైవం", శ్రీ విజయలక్ష్మి ప్రొడక్షన్స్ (ఇంటర్నేషనల్) "లేత వయసు", అనంతలక్ష్మి ఇంటర్నేషనల్ "రామ రావణ యుద్ధం", సుబ్రహ్మణ్యేశ్వర ఆర్ట్ క్రియేషన్స్ "అందాల రవళి", మాయా ప్రొడక్షన్స్ "శ్రీ కామాక్షి కల్యాణం", అమర్ పిక్చర్స్ "పాపికొండలు".

## "తోడు — నీడ"

"రెండో షెడ్యూల్ ఏప్రిల్ 23 నుంచి మే 10 వరకు, మూడో షెడ్యూల్ జూన్ 11 నుంచి 18 వరకు జరుగుతాయి," అన్నారు మహేశ్వరి ఫిలివ్స్ అధినేత ఎస్. పి. వెంకన్నబాబు. ఈయన నిర్మించే పై చిత్రం తొలి షెడ్యూల్ ఏప్రిల్ 7 నుంచి 16 వరకు జరిగింది. శోభన్‌బాబు సరసన సరిత, రాధ నాయికలు. గుమ్మడి, ప్రభాకరరెడ్డి, రావుపల్లి, కొత్త నటి నళిని, సూర్యకాంతం ఇతర పాత్రలు ధరిస్తున్నారు. ఆత్రేయ సంభాషణలకర్త. చక్రవర్తి స్వరకల్పనలో ఆత్రేయ, వేటూరి గీతాలు రాశారు. నవకాంత్ ఛాయ, సాయికుమార్ శిల్పం, గౌతమ్‌రాజు కూర్పుతో కె. బి. ప్రసాదరెడ్డి సహనిర్మాత. "అమాయక చక్రవర్తి" చిత్రానికి ప్రతిభావంతంగా దర్శకత్వం నెరపిన వి. జనార్దన్ ఈ చిత్రానికి డైరెక్టరు.

# సినిమా

## శ్రీ విజయసారథి ఆర్ట్ పిక్చర్స్ ద్వితీయ చిత్రం

''మద్రాసులోనే అక్టోబర్, నవంబర్ మాసాల్లో షూటింగ్ పూర్తయిపోతుంది,'' అన్నారు వేజెళ్ళ సత్యనారాయణ. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో ''రోజులు మారాయి'' అనంతరం వై. కేశవరెడ్డి నిర్మించే చిత్రంలో చిరంజీవి, శివకృష్ణ నాయకులు. నిర్వహణ - ఆనం గోపాల కృష్ణారెడ్డి.

## వై. వి. రావ్ చిత్రంలో మోహన్‌బాబు హీరో

''ఆగస్ట్ నుంచి షూటింగ్ ఉంటుంది. మోహన్‌బాబుది విలక్షణమైన పాత్ర,'' అన్నారు వై. వి. రావు. ఈయన నిర్మించే రవి చిత్ర ఫిలిమ్స్ కొత్త చిత్రానికి ప్రస్తుతం స్క్రిప్ట్ వర్క్ జరుగుతోంది.

సుమన్, అరుణ 'కల్యాణ వీణ'

## రౌడీ

''లో బడ్జెట్ చిత్రం,'' అన్నారు ఆట్లూరి తులసీదాస్. ఈయన ''బెజవాడ బెబ్బులి'' అనంతరం నిర్మించే ''రౌడీ'' చిత్రంలో శివకృష్ణ ప్రధాన పాత్రధారి. పరుచూరి సోదరుల రచన, చక్రవర్తి సంగీతంతో జి. రామమోహనరావు దర్శకత్వం నెరపుతారు. ''ఏప్రిల్‌లో పాటలు రికార్డ్ చేసి, మే నుంచి షూటింగ్ ప్లాన్ చేశాం,'' అన్నారు ఈ చిత్రాన్ని సమర్పించే ఎస్. మోహీ.

## మద్రాసు తెలుగు సంగీత అకాడమీ

ప్రముఖ గాయనీమణి డాక్టర్ డి. కె. పట్టమ్మాళ్ జ్యోతి వెలిగించడంతో ఏప్రిల్ 9న మద్రాసులో పై అకాడమీకి ప్రారంభోత్సవం జరిగింది. ఆ సందర్భంగా విఖ్యాత మృదంగ విద్వాన్ కోలంక వెంకటరాజును, పి. వి. రమణయ్యరాజా సన్మానించారు. ఈ అకాడమీ ఉగాది పర్వదినాన సుప్రసిద్ధ గాయనీమణి ఎస్. జానకిని భారీ ఎత్తున సన్మానించింది.



కృష్ణ, సిల్క్‌స్మిత 'అడవి సింహాలు'లో

## ''సర్దార్'' గా కృష్ణంరాజు

''మే 25 నుంచి జూన్ 15 వరకు జరిగే రెండవ షెడ్యూల్‌తో షూటింగ్ చాలా వరకు పూర్తయిపోతుంది,'' అన్నారు నందం హరిశ్చంద్ర రావు. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించే దేవీ కమల్ మూవీస్ ''సర్దార్'' చిత్రం తొలి షెడ్యూల్ ఏప్రిల్ 11 నుంచి 20 వరకు జరిగింది. కృష్ణంరాజు, జయప్రద, శారద, జగ్గయ్య, సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, గిరిబాబు, రాగిణి పాల్గొంటున్నారు. భీశెట్టి కథకు పరుచూరి సోదరులు సంభాషణలు రాశారు. చక్రవర్తి సంగీతం, ఎస్. వెంకటరత్నం ఛాయ, రంగారావు శిల్పం, నాయని మహేశ్వరరావు కూర్పు, ఆర్ గోపాలరావు సహకార దర్శకత్వం, మల్లి ప్రొడక్షన్ నిర్వహిస్తున్నారు. ''జూలైలో పాచ్ వర్క్, రీరికార్డింగ్ వగైరాలు పూర్తిచేసి, ఆగస్ట్‌లో రిలీజ్ చెయ్యాలనుకుంటున్నాను,'' అన్నారు నిర్మాత కె. సి. శేఖర్ బాబు. ఈ చిత్రంలో కృష్ణంరాజు ద్విపాత్రలు నిర్వహిస్తున్నారు.

## బిజీ రచయిత భీశెట్టి

''పండంటి జీవితం, ప్రేమ మూర్తులు, రఘురాముడు'' చిత్రాల కథకుడుగా వాసికెక్కిన భీశెట్టి కథలు సమకూర్చిన జ్యోతి ఆర్ట్ క్రియేషన్స్ ''అమరజీవి,'' దేవీకమల్ మూవీస్ ''సర్దార్'' చిత్రాలు నిర్మాణంలో ఉన్నాయి. చిరంజీవి హీరోగా భీమవరపు బుచ్చిరెడ్డి త్వరలో ప్రారంభించే ''వేగుచుక్క'', దర్శక నిర్మాత కె. హేమాంబరధర రావు కొత్త చిత్రానికి, కొమ్మనేని దర్శకత్వం వహించే ''ఖైదీరాముడు'', మరికొన్ని చిత్రాలకు, మూడు కన్నడ చిత్రాలకు ఈయన కథకుడు.

# ఆడంబరమైన బంగారు తళుకుల నేతలు

## ఆప్కో అందించే వెంకటగిరి చీరలు

హుందాతనం పరంపరగా అందించే సాంప్రదాయం. నూలు వస్త్రాలలో బంగారు తళుకులు మెరిపించే జిలుగులు. హంసవంటి తెలుపు మరియు ఇంద్రధనుస్సు విరజిమ్మే వివిధ వర్ణాలతో.




ఆప్కో చేనేతలు కొనండి




చేనేతలు



'భాగ్యలక్ష్మి' పరిత, మురళీమోహన్

# సినిమా

## సాగర సంగమంలో ఛాయాగ్రహణం

పురాతన శోభను, సంస్కృతిని, మన హైందవ సాంప్రదాయ చరిత్రను తెలిపే ఓ అందమైన దేవాలయ శిల్పాలను ఛాయాచిత్రాలుగా తీసి, వాటి ఔన్నత్యాన్ని పత్రికల ద్వారా దేశ విదేశస్థులకు చాటిచెప్పాలనే ప్రయత్నంలో మాధవి (జయప్రద) తన ఖరీదైన కెమెరాతో ఫోకస్ చేయసాగింది. ఇంతలో హఠాత్తుగా "ధాం—దీం—ధిత్—తై ..." అని ఒక యువకుని కంఠం; వెంటనే "బాబోయ్! నాయనోయ్!" అనే ఓ కుర్రాడి గావు కేకలు వినిపించాయి., మాధవి గాభరాతో ఆ కేకలు వినిపించిన వైపుకి పరుగు తీసింది.

"ఏమిటా దూకుళ్ళా, అరుపులూనా — చిన్నపిల్లలు దడుసుకుపేటట్టు!" అన్నాడో కుర్రాడు (మాస్టర్ తంబు) కన్నీళ్ళు తుడుచుకుంటూ.

"జత్కులా — జతులు!" అన్నాడో యువకుడు (కమలహాసన్).

"జతులా — పీ బొంద ..."

"ఆఁ! పెద్దవాళ్ళను పీ బొంద — పీ బొంద! అసలు నీకు తియ్యటం వచ్చా?"

కుర్రాడికి భయం కాస్త తగ్గింది. తన మెడకు వేలాడుతూన్న డొక్కు కెమెరా వంక సగర్వంగా ఓసారి చూసుకుని, "నాలుగేళ్ళనుంచి ఫోటో స్టూడియోలో పని చేస్తున్నానంటే, ఏమిటా వెధవ ప్రశ్న? సరిగ్గా నుంచో — తీస్తాను," అన్నాడు.

యువకుడు నిలుచోబోయి కాలికి ఏదో గుచ్చుకుంటే తీయడానికి ఒంగాడు. ఈలోగా వెనుకనున్న కుర్రాడు "రెడీ! స్టెడీ! ఓ—కే! ఫస్ట్‌క్లాస్" అంటూ ఫోటో తీసేశాడు.

తను సిద్ధంకాక ముందే అలా ఫోటో తీసేసి నందుకు వచ్చిన కోపాన్ని అణచుకుంటూ ఆ యువకుడు "చక్రిబాబూ! ఇవి డొమ్ము ఫోటోలు కదా — అందుకని ఒక భంగిమ పెడతాను," అని బ్రతిమాలాడు.

ఆ యువకుని రకరకాల నాట్య భంగిమలను ఆ కుర్రాడు తన డొక్కు కెమెరాలో రీలు తిప్పకుండా క్లిక్ చేస్తూనే ఉన్నాడు. చాటునుంచి మాధవి కూడా ఆ యువకుని ఫోటోలు తీసేసింది.

కె. విశ్వనాథ్ కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో ఏడిద నాగేశ్వరరావు నిర్మించిన పూర్ణోదయా మూవీ క్రియేషన్స్ "సాగర సంగమం" చిత్రం విడుదలకు సిద్ధంగా ఉంది.

## కృష్ణ, కృష్ణంరాజులతో రాధాకృష్ణా మూవీస్ చిత్రం

"కోటి కొక్కడు" అనంతరం కృష్ణంరాజు సమర్పణలో జి. సత్యనారాయణరాజు నిర్మించే చిత్రంలో కృష్ణ సరసన జయసుధ, కృష్ణంరాజు సరసన శ్రీదేవి నాయికలు.

## శ్రీ భ్రమరాంబికా ఫిలిమ్స్ చిత్రం మూడవ షెడ్యూల్

"మూడవ షెడ్యూల్ ఏప్రిల్ 20 నుంచి నెలాఖరు వరకు జరుగుతుంది," అన్నారు హాస్య నటుడు సారథి. ఈయన సారధ్యంలో కేశవరావు నిర్మించే తాజా చిత్రంలో కృష్ణంరాజు, జయసుధ, విజయశాంతి, ప్రభాకరరెడ్డి, గుమ్మడి, అల్లు రామలింగయ్య, సారథి, రాజేష్, ప్రసాద్‌బాబు, కృష్ణవేణి, అత్తిలి లక్ష్మి పాల్గొంటున్నారు. ఈ చిత్రాన్ని సమర్పించే డాక్టర్ ఎం. ప్రభాకరరెడ్డి రాసిన కథకు మద్దిపట్ల సూరి సంభాషణలకర్త. సత్యం స్వరకల్పనలో గోపి గీతాలు రాశారు. ఎం. సత్తిబాబు ఛాయ, బి. ఎస్. కృష్ణ శిల్పం, ఎస్ శ్రీనివాస్ ప్రొడక్షన్, మార్తాండ్ కూర్పు, ఎం. అప్పారావు సహకార దర్శకత్వంతో బి. భాస్కర రావు దర్శకత్వం నెఱపుతున్నారు.

## "లింగడు – రామలింగడు" చిత్రంలో రామకృష్ణ, ఎల్లారీశ్వరి పాటలు

"ఉగాది రోజున, ఆ మర్నాడు రెండు పాటలను రికార్డ్ చేశాం. సత్యం, చక్రవర్తి, జె. వి. రాఘవులు, సముద్రాల సంగీత దర్శకత్వంలో సాహితీ రాసిన ఆ పాటలను రామకృష్ణ, ఎల్. ఆర్ ఈశ్వరి పాడారు," అన్నారు పింజల భాస్కరరావు ఈయన కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, దర్శకత్వం వహించే భూలక్ష్మి కంబైన్స్ వారి సంపూర్ణ హాస్య చిత్రం ద్వారా లారెల్, హార్డీ, చార్లీ చాప్లిన్‌లలా ఉండే ముగ్గురు కొత్త నటుల్ని పరిచయం చేస్తారు సుదర్శన్, స్మిత, జయమాలిని, ఒక సుప్రసిద్ధ హిందీ నర్తకితోపాటు మరి కొందరు పాల్గొంటారు కోటిలింగం ఛాయ, రంగారావు శిల్పం, కాజా కూర్పు నిర్వహిస్తారు "మే మొదటి వారంలో ఔట్‌డోర్‌లో మొదటి షెడ్యూల్ జరుగుతుంది. జూన్‌లో ఇండోర్ షెడ్యూల్. దీంతో షూటింగ్ పూర్తయిపోతుంది," అన్నారు ఈ చిత్ర నిర్మాత ఎ.వి. సత్యనారాయణ.★



జయమాల, అంబరీష్ 'ఛాలెంజి వేటగాళ్లు'

# కొత్తగొంతులు

## టి.యల్. కాంతారావు

ఈ నాటి దార్రిద్యం నుండీ
దుఃఖం నుండీ,
పీడివాదం నుండీ, చీకటి నుండీ,
దోపిడి నుండీ
అజ్ఞానంనుండీ మృత్యువునుండీ
విముక్తికోసం—
దిగివచ్చిన స్వర్గం కోసం
మానవుడు సాగించే సర్వతోముఖ
ప్రయత్నాల్లో
ఉన్నత మనస్సునుంచి ప్రసరించే
వెలుగుల్ని
పదిలపరచేది కవిత్వం.

— సుప్రసన్న

కవిత్వంపై సుప్రసన్నాచారిగారి అభిప్రాయం అది. రామరాజు భూషణుని గ్రంథాలపై పరిశోధనచేసి పి. హెచ్. డి. పట్టం పొందారు. కాకతీయ విశ్వవిద్యాలయంలో తెలుగుశాఖలోపనిచేస్తున్నారు. సంపత్కుమారతో కలసి హృద్గీత ఆనందలహరి అనే కావ్యాలు ప్రచురించారు. తేజశ్చక్రము— దుఃఖయోగిని, అథంనా అనే కావ్యాలు కూడా ప్రచురింపబడటం జరిగింది. ఆధునిక కవిత్వంమీద, విశ్వనాథ సత్యనారాయణగారి వేయిపడగలు లాంటి నవలల మీద విమర్శక వ్యాసాలు రాశారు. ఆధునిక కవితా ప్రపంచంలో మరొక ఆవర్తాన్ని సృష్టించటాని కని చేతనావర్త కవులుగా చేతనావర్తం కవితా సంకలనాలు రెండు వెలయించారు.

వచన కవితా ప్రక్రియను వీరు వాహికగా అంగీకరించారు. అట్లా అంగీకరించటం సంపూర్ణంగా కాదు; పాక్షికంగా మాత్రమే. నవ్య కవిత్వమంతా వచన కవిత్వమేనని కొందరు భ్రాంతి పడుతున్నారని అది ఒక వాహిక మాత్రమేనని, వచన కవిత నవ్య కవిత్వంలో పేర్కొన దగిన ఒక భాగం మాత్రమేనని సుప్రసన్నగారు చెబుతున్నారు. సామాజిక పరిణామము, ఛందః పరిణామము, భావ పరిణామము ఈ మూటికీగల సంబంధం బలవత్తరమైనదని నమ్మేటట్లయితే వచన కవిత ఆధునిక కావ్య నిర్మాణంలో అంతర్భాగం కాదని, దానంతటది ఒక సంప్రదాయమని అర్థం కాకపోదు. నవ్య కవిత్వానికీ, ఆధునిక కవిత్వానికి స్వరూపంలోనూ, స్వభావంలోనూ పెద్ద అంతరం ఉన్నది. 'డార్విన్, ఫ్రాయిడ్, మార్క్స్, ఐన్‌స్టీన్ ఈ నలుగురూ ఆధునిక భావబోధకు నాలుగు స్తంభాలు' అంటున్నారు సుప్రసన్నగారు. అయితే భారతదేశంలో గాంధీ, రవీంద్రుడు, అరవిందుడు సామాజిక, సాంస్కృతిక, ఆధ్యాత్మికరంగాల్లో భవిష్యద్భారతావని యొక్క స్వర్ణయుగాన్ని దర్శించినట్లుగా సుప్రసన్నగారే చెప్పారు. సుప్రసన్నగారి ఆధునికత భారతీయమైన గాంధీ, రవీంద్ర, అరవింద సిద్ధాంతాల్లోనే ఉండటం వల్ల ఆధునిక కవిత్వంపైనా, దానిదైన ప్రక్రియపైన సుప్రసన్నగారికి పై అభిప్రాయం కలుగుతోంది.

దార్రిద్యం, దుఃఖం, చీకటి, దోపిడీలకు మూలకారణమైనది ఏది? దార్రిద్యం అంటే భావదార్రిద్యమా? ఆర్థిక దార్రిద్యమా? ఈనాటి సామాజిక స్థితిగతుల్లో మేధావులు భావదార్రిద్యంలోనూ, పీడితుల ఆర్థిక దార్రిద్యం లోనూ బాధపడుతున్న మాట వాస్తవం. దుఃఖం కాని, దోపిడికాని, చీకటికాని, దార్రిద్యంకాని వీటన్నిటికీ కేంద్ర బిందువు ఆర్థికం. సమసమాజ ఆవిష్కరణకుగాని, మరొరకమైన దివ్యజీవనానికి గాని ఆర్థిక సమానత్వసాధన మొదటి మెట్టు.

ఓ నా దేశమా
ఎందుకు సహిస్తున్నావు నీవు ?
అశక్తుణ్ణి, అనాసక్తుణ్ణి,
సంశయాత్మణ్ణి
పిరికివాణ్ణి, మురికివాణ్ణి, పీడకలలు
కనేవాణ్ణి
పదిమంది తినవలసిన అన్నాన్ని పాతర
పెట్టేవాణ్ణి
పసిపాపల పెదాల పై చిరునవ్వుల్ని
బాంకుల్లో దాచేసేవాణ్ణి —

అని ప్రశ్నిస్తున్నారు సుప్రసన్నగారు. వాణ్ణి ఏం చెయ్యటానికైనా గాంధీ ధర్మ కర్తృత్వం మార్గమా? రవీంద్రుని సాంస్కృతిక సౌందర్యాన్వేషణ మార్గమా? అరవిందుని ఆధ్యాత్మిక దివ్యజీవనం మార్గమా? సుప్రసన్న గారే ఆలోచించాలి.



సుప్రసన్నగారు వారి కవిత్వంలో ఎక్కువగా ఇతిహాస, పౌరాణిక ప్రతీకలను ఉపయోగించారు. వారు చెప్పదలుచుకున్న విషయానికి వారుపయోగించిన ప్రతీకలు తగినట్లుగా ఇమడటం వారి వచన కవిత్వ ప్రత్యేకత. వారిశైలి సంస్కృతీయమైనది. చేతనావర్తం మొదటి సంకలనంలో కంటె రెండవ సంకలనంలో వారి కవితాశైలి సరళమై పాఠకునికి అర్థబోధ కలిగేటట్లుగా ఉంది. మొదటి సంపుటంలో "మనోమయ కోశంలోని మనుష్యుడు దివ్యత్వాన్ని అధిరోహించడం ప్రతీకాత్మకంగా చెప్పబడ్డది. దీనిలో వేదాంత, తాంత్రిక మనశ్శాస్త్ర విషయాలు సమన్వితిని పొందాయి" కనుక శైలి ఆ విధమైన సంక్లిష్టాకృతిని పొందింది. రెండవ సంకలనంలో అధిక భాగం సమాజం, మనిషి ఆక్రమించటంవల్ల శైలి సరళమైంది. వృత్త పద్యాన్ని, వచన కవిత్వాన్నికూడా అందంగా నడప గలిగిన నైపుణ్యం ఉన్న కవి సుప్రసన్నాచార్యులు గారు. కవిత్వం కంటె పాండిత్యం ఒక్కొక్కప్పుడు ముందుకు నడవటంతో వచన కవిత్వపుశైలి వృత్త పద్యపు శైలిగా మారటం జరుగుతోంది. అన్నుప్రాసల, అంత్యప్రాసల గోల సుప్రస్నగారి కవిత్వానికి పట్టక పోవడం ఒక విలక్షణత. కవిత్వంలో కుండలినీ శక్తిని దర్శించటం ఇటీవల కొందరికి ఫాషన్‌గా మారింది. ఆ ఫాషన్ సుప్రసన్నగారిని కూడా వదలకపోవటం చేతనావర్తంలో చూస్తాం. ఏ రంగూ ఏ ఒక్కడి సొమ్మూకాదని, మంచితనం ఒక ప్రత్యేక వ్యవస్థ యొక్క గుత్త స్వభావం కాదని, ఏ జండా జీవన సంపూర్ణతను గ్యారంటీ చెయ్యదని, సంకెళ్ళల్లో మనిషి బ్రతకలేడని, మనిషికి సంపూర్ణమైన స్వేచ్ఛ కలిగిన చైతన్యం కావాలని కొరుకునే కవి సుప్రసన్నగారు. ఆధునికత భూతకాల భావ చైతన్యానికి భిన్నమైంది కాదని దాని పరిణామం మాత్రమేనని నమ్మే కవి సుప్రసన్నగారు. భ్రాంతి నుండి యధార్థానికి, వ్యష్టి నుండి సమిష్టికి ఆధునిక కవితా ప్రస్థానమని సిద్ధాంత భేదంతో సుప్రసన్నగారూ అంగీకరిస్తున్నారు. కళాకార్య రంగాలలో దేశకాల భాషా భావభేదాలతో భిన్నత్వాన్ని కలిగించే అవకాశం లేదని వీరి నమ్మిక. ఇజాల భేదం ఎటూ ఉండనే ఉంది. కవిత్వ రూపాన్ని గురించి పేచీ పడవలసిన అవసరం లేదని వీరి భావన. భవిష్య దాశావాదంతో చేతనావర్తంలో వీరి ఖండిక ముగియడం వారిలోని సమాజ పరిణామాసక్తతకు మంచి ఉదాహరణ.

మృత్యుచ్ఛాయావీకితమైన
ఈ తమోరాశిలో నుండి
మేల్కొన్నవాణ్ణి ఒకణ్ణి –
చీకటి ముద్ద కరిగిపోయి
పైడితుంపులు ప్రకాశించి
ఆనందలోక కవాటాలు వివృతం చేసే
వేళ కోసం

పాడుతున్నాను ప్రబోధ సంగీతాన్ని
పిలుస్తున్నాను ఆనంద ప్రభాతాన్ని. ★




శంకరరావుగారు ఇంగ్లాండువచ్చి యిరవై సంవత్సరాలు దాటింది. పాతికేళ్ల వయసప్పుడు పిరికిచూపులతో హీత్రో ఎయిర్‌పోర్టుని పావనం చేసిన ఆ కుర్ర డాక్టరు మరో పాతికేళ్ళు దాటకుండానే గ్రేట్ బ్రిటన్‌లో ఒక గ్రేట్ సైకియాట్రిస్టు అనిపించుకున్నాడు.

ఇప్పుడు ఆయన బ్రైటన్ అనే పెద్ద వూరులో సీనియరు సైకియాట్రిస్ట్ అవటమేకాదు అదే వూళ్ళో తన పలుకుబడికీ పదవికీ తగ్గట్టుగా బకింగ్‌హామ్ పేలస్ అంత పెద్ద భవంతి దగ్గరుండి కట్టించుకున్నారు. ఆధునిక హంగామాలతో ఆ లోగిలి అత్యంత వైభవోపేతంగా తులతూగుతున్నా ఆయన పుట్టిన దేశాన్ని గుర్తుచేస్తూ యింటి గుమ్మానికి పచ్చని ప్లాస్టిక్ తోరణాలు చప్పుడుకాని మువ్వల్లా వ్రేలాడుతూ వుండటం చాలా చెప్పుకోదగ్గ విషయమేమరి.

ఆయన సతీమణి భారతీదేవి స్వతహాగా అంత పెద్ద చదువులు చదవలేదు. ఏదో యింటర్మీడియట్ తప్పింది. కాని యిండియావదిలి యింగ్లాండు వచ్చిన యిరవై ఒక్క రోజులకే యింగ్లీష్ భాషని తన మాతృభాషకంటే మధురంగా మాట్లాడటం నేర్చుకుంది. అలా అని ఆవిడ ఏకసంథాగ్రాహి అనుకోటంకూడా పొరపాటే. షాపింగ్‌లిస్ట్ పదిసార్లు పఠించి చివరికి తనకి అత్యంత ప్రీతివంతమైన చీజ్‌ముక్కో, చికెన్‌ముక్కో కొనుక్కోటం మర్చి యింటికివచ్చి అయ్యో అనుకుంటుంది ఎప్పుడు బజారుకి వెళ్ళినాసరే. పోతే భారతిలోవున్న గొప్పతనమేమిటంటే కొన్ని విషయాల్ని కొన్ని క్షణాల్లో మెదడుకి చురుకుగా పట్టించుకుంటుంది. ఆ ప్రతిభతోనే యింగ్లీష్ భాషని యింగ్లీష్‌వాళ్ళే అసూయపడేటంత స్పష్టంగా, నేర్పుగా మాట్లాడటం అలవాటు చేసుకుంది ఆవిడ ఆ పది పదిహేనేళ్ళ స్థిరనివాసంలో.

భారతికి తెల్లవాళ్ళ తైతక్కలంటే చాలా మక్కువ. వాళ్ళ ఆచారాలన్నా పైపై ఫేషన్‌లన్నా ఎనేలేని ప్రీతి. అందుకే ఆ ఆంధ్రుల ఆడపడుచు తన రూపాన్నీ, రూపానికి రేఖలుదిద్దే ఆడంబరాన్నీ అన్నిటినీ మార్చుకుంది అలంకరణ పేరుతో. పాశ్చాత్య నాగరికతా ప్రభావంలో క్రిందా మీదా పడి కొట్టుకుపోతూ అపురూపంగా అద్దుకున్న ఫేస్ పౌడర్‌లా అప్పటికప్పుడు గ్రేట్ బ్రిటన్‌లో వచ్చే

మార్పులకీ, కూర్పులకీ నేర్పుగా అలవాటు పడి పోతూ వచ్చింది అన్ని సంవత్సరాలూ.

భార్య మనసు దేనికీ బెంగపడకుండా కాపాడు కుంటూ వచ్చారు శంకరరావు. కోరగానే పెరటిలో జలకాలాటకి ఓ కోనేరు కట్టించిపెట్టారు. నోరు లేని జీవాలంటే భార్యకి ఎంతో జాలని, వూసుపోటానికి ఓ రెండు జాతికుక్కల్ని హాలెండునుంచి కొని తెప్పించి, ఓ క్రిస్‌మస్ రోజున ఆవిడకి కానుకగా యిచ్చారు.

అపురూపమైన అర్ధాంగి సుకుమార శరీరం చలికి వణక్కుండా వుంచాలనే ఆరాటంతో ఎయిరు కండిషన్డు బి. ఎమ్. డబ్ల్యు కారు కొనియిచ్చారు. యిద్దరూ కలిసి వెళ్తే వుల్లాసంగా వుంటుందని ఓ ఆడీకారు కూడా కొన్నారు. ఇలాంటి హంగులన్నీ వూసగ్రుచ్చితే అవో పెద్దగ్రంధమే అవుతుంది మరి ?

ఎన్ని వన్నెలున్నా చూడడానికి కళ్ళు లేకపోతే అతిలోక సుందరి ఎలా అవుతుంది ఏ అప్సరసయినా. శంకరరావు భారతీదేవి విషయంలో కూడా అలాగే అయ్యింది. ఎన్ని సంపదలతో తులతూగుతున్నా మరెన్నో సౌఖ్యాల్లో తేలియాడుతున్నా యింటికి వెలుగునిచ్చే ఓ పసికందు చిరుచూపుకి నోచుకోలేక పోయింది ఆ జంట అన్ని ఏళ్ళుగా. ఎన్ని భోగ భాగ్యాలువున్నా ఓ పూవుకీ పిందకీ నోచుకోకపోతే కల్పవృక్షానికి కూడా ఆ పేరు సార్థకం కాదేమో ?

పిల్లల కోసం ప్రత్యేకమైన పూజలు చేశారు. ఇండియా వెళ్ళి గుళ్ళలో విగ్రహాల్ని వూళ్ళలో స్వాములనీ యిలా ఎందరెందరినో మ్రొక్కివచ్చారు. అయినా యింగ్లాండు వైద్యనిపుణులు ఓ శుభోదయంలో శలవిచ్చిన వేదవాక్యాలు అలా చెరగకుండా వుండిపోయాయి అన్ని సంవత్సరాలూ.

భారతికి పిల్లలు పుట్టరని రూఢీ అయిన దగ్గరనుంచి శంకరరావుగారి ఎదలో ఓ రకమైన వైరాగ్యం ఏర్పడింది. అయినా ఆయన తన తీరు తెన్నుల్లో ఎలాంటి తేడా కన్పించ నివ్వలేదు పైకి భారతి బెంగపెట్టుకుంటుందని.

సాయంత్రం ఆసుపత్రి నుంచి రాగానే స్కాచ్ విస్కీ ప్రక్కన పెట్టుకుని అతి నిదానంగా సేవిస్తూ టి.వి. ముందు రిమోట్ కంట్రోల్ స్విచ్ పట్టుకుని రాత్రి పదిగంటల వరకూ వూగే కుర్చీలో కునికిపాట్లుపడుతూ విశాల ప్రపంచంలో జరిగే వార్తల్ని కొనకంటితో ఓ సారి చూశాననిపించి చివరికి నిద్రాదేవివడిలో తల ఆన్చుకునేవారు సుతిమెత్తన్ని ఎలక్ట్రానిక్ బెడ్‌లో భారతీదేవి సరసన చోటుచేసుకుంటూ.

పది సంవత్సరాలుగా ఆ తీరు ఆయన దినచర్య అయిపోయింది బయట ప్రపంచంలో మంచు కురుస్తున్నా, తుఫానులు చెలరేగుతున్నా; మరేం జరుగుతున్నా !

అయినా ఆయనకి బాగా తెలుసు ముట్టుకో డానికి వెన్న మెత్తగా వున్నా విసిరి పెట్టికొడ్తే వెన్న కూడా వాడిగా తగుల్తుంది వంటికని. ఒకోసారి ఒకోదెబ్బ నొప్పి పుట్టించటంతోపాటు ఎనలేని మేలు

కూడా చేస్తుంది మరి తిమ్మురుపట్టిన మనసుకి తెలివిచెప్పేస్తూ ?

"ఈ మధ్య మీరు బొత్తిగా పరాకుగా వుంటున్నారు" భారతీదేవి అడిగింది ఓ ఆదివారం.

"ఉ" అన్నారు శంకరరావు పరాకుగా విస్కీ పినోదిస్తూ.

"యింటికి చాలా లేట్‌గా వస్తున్నారు కూడా" అష్టోత్తరం పరిపోక సహస్రనామావళి జపించింది ఆ తులసీదేవి.

"ఏమిటే హాస్పిటల్‌లో నాకేమి పని లేదనుకుంటున్నావా" విసుగుదల కనిపించింది ఆయన ముఖంలో.

కబుర్లలో టి. వి లో వస్తున్న "వరల్డ్ ఎబౌట్ అజ్"—"ప్రోగ్రామ్‌కి" భంగం కలుగుతుందనో లేక ఆ విషయం ఆయనకి యిష్టంలేకనో మరి ఆ విసుగుదలంతా ?

"ఏమిటో వున్నట్లుండి అంతమని..."

"పిచ్చి, ప్రేమా చెప్పి పుడ్తాయటోయ్ ..." వున్నట్టుండి విసిరాడు ఆయన ఓ చలోక్తి.

"వేదాంతం చెప్పమంటంలేదు మిమ్మల్ని ఎవరూ" రుసరుసలాడింది భారతీదేవి.

"ఐ.సీ ... బై దిబై ... కాస్త జిన్ తీసుకో కూడదూ నీకేమీ వూపుపోనట్లుంది" అన్నారు శంకరరావు చిరునవ్వు పెదవుల మధ్య పందిస్తూ.

"సలహాలు చెప్పటానికి ఎక్కడలేని ఓపికా వస్తుంది కాబోలు" భారతీదేవి భుజాలు ఎగరేస్తూ విసురుగాలేచి వంటింట్లోకి వెళ్లిపోయింది.

ఆ రోజుకి ఆ కథ అక్కడికి ఆగిపోయినా పంవత్సరాలుగా సీరియల్‌గా వస్తున్న నవలలా పశేషంగానే వుండిపోయింది భారతీదేవి మనసులో ఎన్నాళ్లనుంచో రగులుతోన్న ఆ అరవివేదన తీరని మనోవేదనాను.

ఆవిడకి అన్ని అనుమానాలు కలగటంలో అర్థం లేకపోలేదు. బ్రిటిష్ వాతావరణం అలాంటిదనీ, చుట్టూవున్న మూడామణి దొరసానులు, ఎత్తుమడమల వయ్యారిభామలు ఎంతకైనా తెగించగలరనీ. అవసరానికి పనికివచ్చే అబలుదు కనిపిస్తే ఏమైనా చేస్తారనీ ఎంతకైనా వెనుకాడరనీ ఎప్పుడో గుర్తించింది భారతీదేవి, న్యూస్‌పేపర్లలో వచ్చే రెండోపేజీ దిగంబర దేవకన్యల కథలు చదివీ, టి.వి. లో 'లోకంపోడక' చూసీ.

శంకరరావు మరింత వింతగా ప్రవర్తిస్తున్నారు ఓ మూడు నాల్గు నెలల నుంచి.

"లండను వెళ్తున్నానోయ్ భారతీ... నాకోసం ఎదురుచూస్తూ కూర్చోక నీ పని చూసుకో ... వీక్ ఎండుకి నేను యింట్లో వుండను మరి" అని చెప్పి అర్ధాంగి అనుమతికి ఎదురుచూడకుండా హడావిడిగా తన ఆడే కారులో దాక్కుని ఎక్కడికో పారిపోతున్న భర్తని చూసి ఏ భార్య మనసువాపోదు.

మనసుని మెలిపెడ్తున్న అనుమానాన్ని మట్టుపెట్టలేక ఓ అడుగు ముందుకేసింది భారతి శంకరరావుని నిలదీస్తూ.

"మీ పద్ధతి నాకేమి నచ్చలేదు" అంది.

పరుగెత్తి పారిపోలేకపోయాడు ఆయన ప్రతీ ఉక్రుకుంపారంలా.

"ఏ పద్ధతి..." ఓ అడుగు వెనక్కువచ్చి వెటకారంతో కొట్టిపారేయాలని ప్రయత్నించాడు ఆ విషయాన్ని.

"అదే ఆ నవ్వే నాకు నచ్చదు..." ప్రసంగాన్ని పొడిగించింది భారతి.

"ఐపీ...బాగుంది నీ వరస. నీకేదో నచ్చాంటే యిష్టంలేదని అందరినీ ఏడుస్తూ కూర్చోమంటావా ఏమిటి నీ ఆనందంకోసం" చలోక్తి విసిరాను అనిపించారు శంకరరావు.

"గుండెలమీద చేయివేసి చెప్పండి నిజంగా మీరు ఏం చేస్తున్నారో."

"నవ్వేమీ బెంగపడకులే...నా వుద్యోగం నేను చేసుకుంటున్నాను."

"నేను అడిగింది అదికాదు."

"ఏమిటోయ్ వున్నట్లుండి ఈ యక్షప్రశ్నలు. నీ వంట్లో బాగానే వుందికదా."

"మీరేమి వక్రీ అవ్వక్కర్లేదులెండి మీ పిచ్చేమీ నాకు పట్టలేదు."

"తప్పొదియ్యా పెళ్ళయి పాతికేళ్ళు అవుతున్నా నీకు యింకా ఆ తిక్క కుదరలేదు సుమా."

మూతి ముడుచుకుంది భారతి మొరటుగా సమాధానం చెప్పలేక.

"అయినా నాకు తెలీక అడుగుతాను ఏ జవరాలు ఈ జుట్టు నెరిసినవాడ్ని వరిస్తుందనట్టా నీకు యింత కంగారు" అన్నారు శంకరరావు ఆరాతీస్తూ.

"జుట్టు నెరిసిందన్న బాధ వీళ్ళకి ఎప్పుడూ వుండదు. రంగుపూసి మరీ మార్చుకుంటారు. కంటికి కాస్త యింపుగా కనిపిస్తే...ఈ దొరసానుల సంగతీ, ఈ దేశం సంగతీ నాకు తెలీదు అనుకున్నారా ఏమిటి?" కాని వడపోసిందంతా గొంతుకలోంచి వెళ్ళగక్కింది.

"నీ పెడార్థాలు పాడు ఎంక్వయిరీలు చాలు కాని...నా మానాన్న నన్ను వదిలిపెడ్తావా భారతీ నీకు పుణ్యం వుంటుంది" కాస్త కలవరపాటు కంపించింది ఆయన కంఠంలో.

"అంతేకాని అసలు సంగతి చెప్ప రన్నమాట."

"ఏముంటుందోయ్ చెప్పటానికి ... మూడు భారతీ పిచ్చి పిచ్చి ఆలోచనలతో నువ్వు తలబద్దలు కొట్టుకొని నాకు తలనొప్పి తెప్పించమాక...స్వీటీ... తృప్తంగా విడియోలో ఆ శంకరాభరణం సినిమా పెట్టుకుని చూడు... చాలా బాగుంటుందని చెప్పి మరీ యిచ్చాడు రెడ్డి ... చూసి ఎలావుందో చెప్పు. రాగానే నేనూ పెట్టుకుని చూస్తాను ..."

శంకరరావుగారిదే పైచేయి అయ్యింది ఆ రోజు కూడా.

* * *

శనివారం సాయంత్రం మార్గరెట్ డేవిస్ని ఫోనుచేసి మరీ ఆహ్వానించింది. వున్న పళంగా విందు భోజనం వంకపెట్టి.

మార్గరెట్. డాక్టరు డేవిస్‌కు మొదటి భార్య. డాక్టరు డేవిస్ డాక్టరు శంకరరావుకి జూనియరే అయినా ఒకే హాస్పిటల్‌లో పది సంవత్సరాలుగా సైకియాట్రిస్ట్‌లుగా కలిసి పనిచేస్తున్నారు యిద్దరూ. వృత్తిరీత్యాగానే కాకుండా స్నేహం పేరుతో కూడా ఒకరికొకరు బాగా చేరువయ్యారు ఆ పది సంవత్సరాల్లో.

భారతి మంచితనం మార్గరెట్ మనసుని బాగా ముచ్చటపరిచేది. మార్గరెట్ మాటకారితనం బెంగపడ్డ భారతి మనసుకి మంచుకొండల్లో వేడిగాలిలా తగిలి సేదతీర్చేది. అందుకే ఒకరికొకరు బాగా దగ్గరయ్యారు అవసరాలు తీర్చుకోటానికీ కష్టసుఖాలు చెప్పుకోడానికీ.

"ఏమిటి భారతీ ఈరోజు అంత డల్‌గా వున్నావు...లవ్ సిక్‌నెస్ కాదు కదా కొంపతీసి" ఆంగ్లంలో ఓ చలోక్తి విసురుతూ ముచ్చటగా నవ్వింది ముప్పైయ్యేళ్ళ మార్గరెట్.

"ఈ రోజుకి అదొక్కటే తక్కువ..." ప్రోసి






పుచ్చింది భారతి చిరునవ్వు పెదవులమీద లిప్‌స్టిక్‌లా పూసుకుంటూ.

"అహ... ఏదో వుంది... లేకపోతే నువ్వు అంత నిరుత్సాహంగా మాట్లాడవు. ప్లీజ్ భారతీ నాతో చెప్పటకేమ్మైన అభ్యంతరమా" అనురాగ పూర్వకంగా భారతి చేయి పట్టుకుంది ప్రక్కకు వచ్చి కూర్చుంటూ.

మనిషి ఏ దేశానికి చెందినా, తనువు ఏ రంగుతో తళతళలాడుతున్నా మనసుకి కలిగే ఆవేదన మనిషిని కరిగించే అభిమానం ఒక్కటే మరి.

"ఏం చెప్పమంటావ్ మార్గరెట్... ఈమధ్య రావు చాలా మారిపోయాడు.

ఏదో పనిపెట్టుకుని ప్రతి వీక్ ఎండ్ ఎక్కడికో వెళ్ళిపోతున్నాడు. యింటిపట్టున ఓ క్షణం నిలవకుండా... యిదంతా ఎందుకో నాకేమీ తోచడం లేదు..."

మార్గరెట్ చూపులు త్రిప్పుకుంది తనకి ఆ విషయం ఎప్పుడో తెలుసు అన్నట్లు.

"నువ్వు వింటున్నట్లు లేదు..."

"నో...నో... అయామ్ లిజనింగ్..."

"నీకు ఏదో తెలిసినట్లుందే ..."

"భలేదానివే ... నాకేం తెలుస్తుంది. అందులో యిలాంటి విషయాలు." మార్గరెట్ మాట తడబడింది.

"ఫర్‌గెట్ ఎబౌట్ యిట్ ... టెల్ మి వాట్ వుడ్ యు లైక్ టు హేవ్" బ్రిటన్ మర్యాదలకి బాగా అలవాటుపడి వుండేమో భారతి వెంటనే మాట మార్చింది.

"ఫెచ్ మి వోడ్కా అండ్ లెమనేడ్ ప్లీజ్..."

మార్గరెట్ సంభాషణలో సంప్రదింపుల ధోరణిని సూచించింది.

"ష్యూర్" అంటూ లేచి వెళ్ళి యిరువురికీ చెరో గ్లాసులో మత్తుపానీయాలు వంచుకువచ్చింది భారతి.

"ఇప్పుడు చెప్పు మార్గరెట్ నీకేం తెలుసునో."

బ్రిటిష్‌వారి పరిపాలనా దక్షతని ప్రయోగించింది దొరసానిమీద తన పరువు కాపాడుకోటానికి.

"తప్పదంటావా" దారిలోకి వచ్చింది మార్గరెట్ మత్తుపానీయం మునిపంటి క్రిందకి ప్రవహించగానే.

"నువ్వు చూపులు దించుకున్నావంటే ఏదో విశేషమే వుంటుందని నాకు తెలుసు మార్గరెట్. యిన్నాళ్ళు మన స్నేహంలో నీ గురించి నేను ఆ మాత్రం తెలుసుకోలేనంటావా చెప్పు" అంది భారతి పట్టువిడవకుండా.

"ఉ" గాఢంగా నిట్టూర్చి — "సరే ... నువ్వు అంతగా అడుగుతుంటే అసలు విషయం దాచగలనా ... దాచి నీకు ద్రోహం చేయగలనా చెప్పు భారతీ" అంది నిదానంగా.

"ప్లీజ్ ... ముందు ఆ విషయం ఏమిటో చెప్పు ... " భారతి గుండె దడదడలాడింది ఎలాంటి విషయం వినాల్సి వస్తుందో అని.

"ఆవేశపడకు భారతీ ... యిది నేను కళ్ళతో చూసింది కాదు. అందులో వున్న నిజం ఏమిటో ఆ పరమాత్ముడికే తెలియాలి మరి. ప్రామిస్ ఎవరో చెప్పుకుంటుంటే విని యింకెవరో చెప్పుకుంటుంటే

## ఎడారిలో ఎర్ర కలువ

నా చెవిని పడింది మరి ..."

మార్గరెట్ గ్లాసులో వోడ్కాని మెల్లగా సిప్ చేస్తూ కథ మొదలుపెట్టింది.

* * *

"వెండీ డార్లింగ్ యు లుక్ మార్వలెస్ టుడే" అంటూ దొరసాని నడుం చుట్టూ చేతులు వేసి దుడుకుగా పెదవులు చుంబిస్తూ వుక్కిరి బిక్కిరి అయ్యారు అలవాటు లేని శంకరరావు.

అతని పట్టు అతి నేర్పుగా విడిపించుకుని దూరంగా జరిగింది వయ్యారిభామ వెండీవాకర్.

"ఏమిటి సంగతి ఈరోజు మరీ హుషారుగా వున్నావ్". అంది ముద్దుగా.

"సింపిల్ . అయ్ హేవ్ కమ్ టు ఎ డెసిషన్..." ఆ పెద్దమనిషి మనసుకాస్త కుదుట పడింది వెచ్చని కౌగిలిలో తగిలిన మెత్తని హాయికి.

"ఐసీ... ఏమిటో ఆ గొప్ప నిర్ణయం..." గోముగా చూస్తూ కనుగ్రీటింది వెండీ చిలిపిగా.

"చెప్తాను... యిలా కూర్చో..." అంత లోగిల్లో చోటే లేదన్నట్లు తన వడిలో కూర్చోపెట్టుకున్నారు.

"ఆల్‌రైట్..." వెండీ చొరవకి సిగ్గు హడలి చచ్చింది.

వుల్లాసంగా వడిలో సింహాసనం ఎక్కి వయ్యారంగా వుంచుకున్న వాడి మెడచుట్టూ చేతులు వేసింది చురుకుగా.



"మనం పెళ్ళి చేసుకుందాం..." మాట తటబడ్డాడు శంకరరావు ఆ కోమలాంగి వంపు సొంపులికి తట్టుకోలేక.

"యూ మీన్ మేరేజ్..." పడిపడి నవ్వింది వెండీ.

"ఏం నీకు యిష్టం లేదా" తెల్లబోయారు దొరసాని ధోరణికి.

"ఓ మై డార్లింగ్... యిష్టం ఎందుకు వుండదు... అందులో పెళ్ళంటే ఏ ఆడదానికైనా మోజేమరి..." ఆప్యాయంగా నెరిసిన చెంపలు నిమిరింది వెండీ.

"చిత్రంగా వుందే..."

"ఏమిటి నేనా... నా మాటలా..."

"అదే నువ్వు పెళ్ళంటే ఏ ఆడదానికి మోజు వుండదు అంటుంటేను వింటానికి కాస్త..."

"విచిత్రంగా వుందా... మైలవ్..." వెటకారంగా నవ్వింది వెండీ.

"అది కాదు నా వుద్దేశం..."

వెండీ తీరు శంకరరావుగారికి ఏ మాత్రం నచ్చలేదు. ముడతలు పడ్డ కనుబొమల్లో తన అనుమానాన్ని పదిలంగా దాచుకుని పొంగుకువస్తున్న ఆవేశానికి వలపుతో ఆనకట్ట కట్టిపారేశారు వెండీని దగ్గరకు లాక్కుని లేత పెదవులమీద ముద్దుల వర్షం కురిపిస్తూ.

"దటీజ్ ఎనాఫ్..." మెల్లగా ముఖం త్రిప్పుకుని— "లిజన్ టు మి..." అంది.

"ఎస్..."

"నిజానికి నాకు పెళ్ళంటే అసలు యిష్టం లేదనే చెప్పాలి మరి... ఏదో మొకుతాడుతో కట్టి పడేసిన గడ్డిమోపులా పెళ్ళి చేసుకుంటే ఈ మనిషి జీవితానికి ఏమి స్వేచ్ఛ వుంటుంది చెప్పు..."

"అలాగ..."

"కమాన్ డార్లింగ్ డోంట్ బి సిల్లీ... నేనేదో అన్నానని అనవసరంగా బుర్ర పాడుచేసుకోక...ఎవరి అభిప్రాయాలు వాళ్ళవి ఏమంటావ్... ఎనీహౌ నీలాంటి మగాడు పెళ్ళాడ్తానని ముందుకువస్తే అబ్బే కాదని ఏ ఆడది అంటుంది చెప్పు... నీ పిచ్చికాని... కమాన్ చీర్ అప్ అయ్ సే..." అంది కవ్వింపు చూపుల్లో రవ్వంత వయ్యారం వలకబోస్తూ.

"రియర్లీ ... ఆర్ యు హేపీ..." నమ్మలేక పోయారు శంకరరావు.

"వన్ థింగ్... పెళ్ళంటే అంత తేలికంటావా..."

"ఈ నారిజాక్షి వప్పుకోవాలే కాని అదేమంత కష్టమైన పనికాదు..." బుగ్గమీద చిటికవేశారు శంకరరావు హుషారుగా.

"డాక్టర్ రావు ది గ్రేట్ సైకియాట్రిస్టు వైఫ్‌కి విడాకులు యిచ్చి... ఓ సర్వ సాధారణమైన నర్స్‌తో లేచిపోయాడని నలుగురికీ తెలిస్తే నీ పరువు ప్రతిష్ఠలు ఏమవుతాయో ఆలోచించావా..."

"పరపతిపోతుందని వాపోడానికి నేను యిప్పుడు ఇండియాలో లేనుగా..."

"ఓ... ఐసీ..."

"అయితే నీ నిర్ణయం మాటమేటి..."

"నీ భార్య వప్పుకోకపోతేనో..." ఎదురు ప్రశ్న వేసింది వెండీ.

"నో... వప్పించే బాధ్యత నాది... నీకెందుకు అదంతా నాకు వదిలేసేయ్..."

"యు మస్ట్ బి జోకింగ్..."

"నో... నో... అయ్ ప్రామిస్..." అన్నారు శంకరరావు ఆవేశంగా.

"మీ ఇండియన్ లేడీస్ అంత తేలికగా వప్పుకుంటారా విడాకులు యివ్వటానికి..."

"విడాకులు యిస్తున్నానని అనలేదే నేను..." చిలిపిగా నవ్వారు శంకరరావు.

"దెన్ వాట్..."

అనుమానంగా ఏదో అర్థమయినట్టు అతని ముందుకు వచ్చి ఆయన ముఖాన్ని హద్దులు దాటి దండయాత్ర సాగిస్తోన్న తన లేత గుండెలకేసి ఆప్యాయంగా హత్తుకుంది, నాజూకైన వేళ్లతో జుట్టు నెమ్మదిగా నిమురుతూ.

"వెండీ డార్లింగ్ షల్ అయ్ ఫిక్స్ యు ప్ డ్రింకు..." అన్నారు శంకరరావు వూపిరాడక వుక్కిరి బిక్కిరి అవుతూ.

'ష్యూర్ హనీ...ప్లీజ్ డు...' అంది వెండీ వాకర్ ఏదో ఆలోచిస్తూ.

బకార్డీ గ్లాసుల్లోపోసి కోక్ కేను విప్పి మగువని మత్తుపానీయాల్లో ముంచేశారు శంకరరావు, ఆ మిగిలిన రాత్రంతా పండగ చేసుకుంటూ.

(ముగింపు పైవారం)




### కె. ఎస్. కె. – తణుకు

'కులంపేరిట మీలో కొందరిని వేరుచేయవద్దు' అని రేడియోల ద్వారా ప్రచారం చేస్తున్న ప్రభుత్వం వారే కుల ప్రాతిపదికపై ఉద్యోగాలిస్తున్నారు. దీని అర్థం ?

★ ప్రచారం వేరు, ప్రవర్తన వేరు !

ప్రచారం ఓట్ల కోసం, ప్రవర్తన భుక్తి కోసం !

### సి. పి. – విశాఖపట్నం

కట్నాలు తీసుకోమని ఉపన్యాసాలు దంచే యువకులు నిజ జీవితంలో ఆచరించ రెందుకని ?

★ "ఆచరించాలనే వుంది. కాని అమ్మ ఛస్తానంటోంది" అన్నదే వాళ్ల స్టాండర్డ్ జవాబు.

### విజేంద్ర – ఆదోని

మీ సమాధానాలలో ఆడవాళ్లను సమర్థిస్తూనే ఒక రకంగా ఇన్‌డైరెక్ట్‌గా కించపరుస్తున్నారు. ఒక ప్రశ్నలో తల్లిని సమర్థించి మరో ప్రశ్నలో కూతుర్ని గురించి కామెంట్ చేశారు. ఆ కూతురూ ఆడదే నన్న విషయం మరిచారా ?

★ మరువలేదు; కాని నిజం చెప్పాలంటే . ఆడవారినే సమర్థిస్తానని కొందరంటారేగాని – నే నెవరినీ ప్రత్యేకంగా సమర్థించను – వాస్తవ పరిస్థితిని తప్ప. ఈ మాటు చదివి చూడండి.

### ఎమ్. ఎస్. – హైదరాబాదు

మీకు కొడుకులు లేరని – ప్రయోజనం లేని పుత్రులను కన్న తల్లులంటే మీకు సానుభూతి లేదు ..

★ పొరపాటు – నాకు ఆడా–మగా తేడాలేదు. కొడుకు–లుంటే వారినే వెనకేసు కొస్తాననుకోకండి ! ప్రయోజనం కోరి సంతానాన్ని పెంచే దృష్టి నాకు లేదు అంతే.

### కె. ఎస్. – కర్నూలు

చదువు విషయంగా తోటి అబ్బాయిలతో మాట్లాడితే శీలం లేదనుకొనేవాళ్లను ఏమనాలి ?

★ అలాంటి సంకుచితులని చూసి జాలిపడాలి. శీలం వ్యక్తిగతమైనది. దాని విలువ ఎవరికివారే నిర్ణయించుకుంటారు. పోగొట్టుకోదల్చకపోతే–శీలం పోదు.

### ఎం. వి. – నర్సీపట్నం

నేటి నాగరికతలో నాస్తికులమని చెప్పకోడం ఫాషనైంది. వెర్రి వేషాలు వేసే నేటి కాలం కన్నా ఆచారాలు, సంప్రదాయం ఉన్న నిన్నటి కాలమే నా కిష్టం.

★ ఆచారాలు, సంప్రదాయాలు – మనిషికి ఒక రకం క్రమశిక్షణ నిస్తాయి అవి ఛాదస్తాలుగా మారనంత కాలం – నాకూ యిష్టమే.

### ఆర్. ఏ. పి; డి. ఎం. కె; పి.వి.ఆర్. – పెనుమత్ర

మేం ముగ్గురం ఒకరికి తెలియకుండా ఒకరము ఒకే అబ్బాయిని ప్రేమించాము. ఇప్పుడు తెలిసి కొన్నాము మా ముగ్గురిలో ఎవరు చేసుకోవాలి – ముగ్గురం ప్రాణస్నేహితులము

★ అసలు కేండేటునే వదిలేస్తే పోలే ! ! స్నేహానికి స్నేహం మిగులుతుంది, త్యాగానికి త్యాగం చేసినట్టు అనిపిస్తుంది. (చక్కని సినీ ముగింపు కదూ ?)

### కె. ఏ. ఆర్. – రూర్కేలా

మన దేశంలో నిరుద్యోగ సమస్యే లేకుంటే – ప్రేమికులు పెళ్లి చేసుకోబోయే ముందయినా కనీసం తమ తల్లితండ్రుల అనుమతి తీసుకోరని నా అభిప్రాయం.

★ అయితే – నిరుద్యోగ సమస్య తీరే శుభ ఘడియల కోసం తల్లితండ్రులు ఆత్రంగా వేచి చూస్తారని ఎదురుచూద్దాం.

### జి. వి. ఎస్. ఆర్. – తిరుపతి

కారులో వెనుక సీటులో కూర్చుందుకు, జీపులో ముందు సీటులో కూర్చుందుకు ప్రాధాన్యత నిస్తారెందుకు ?

★ ఆ సీట్లు సుఖంగా వుంటాయి కూర్చుందుకు !

### ఎమ్. కె. డి. – సికింద్రాబాదు

మనని ఎక్కువ నిరుత్సాహపరిచేది ఏది ?

★ నానుటుకు నాకు, తెలివితక్కువ స్నేహితుల కంపెనీ చాలా బాధాకరంగా వుంటుంది !

### ఎస్. ఎమ్. – రేపల్లె

ఏమండీ రామలక్ష్మిగారూ, ఇటీవల మీ ప్రశ్నావళిలో ప్రేమ ప్రశ్నలు ఎక్కువగా ప్రచురిస్తూ విజ్ఞానాన్ని నాశనం చేస్తున్నారని భావిస్తున్నాను ?

★ చిత్తం. తిండి, తరవాత ప్రేమ. తరవాత విజ్ఞానం అనుకున్నాను నేను !

### పి. ఎస్. జి. – గుంటూరు

ఏమండీ రామలక్ష్మిగారూ, మీరు వ్రాసే నవలలను ఎందుకు రాస్తున్నారు ?

★ ఇంకోపని చేతకాక !! లేకపోతే ఏమిటండీ యీ ప్రశ్న? చైతన్యం తేవాలని రాస్తున్నానంటే– మీరే కోప్పడతారు. పోనీ రాబడికోసం రాస్తున్నా నన్నా – మీరే కోప్పడతారు. ఇంకేం చెప్పమన్నారు?

### పి. పి. ఎస్. – వూళ్ళ

మేం ప్రేమించుకున్నాం. కాని పెండ్లి చేసుకోడానికి భయపడుతున్నాం ?

★ ఏముంది కథ మామూలే – ప్రేమని త్యాగం చేసేయండి. పిరికివారికి ప్రేమించే హక్కు లేదు. ఆరాధించే హక్కుంటే–వుండొచ్చు !

### కృష్ణ – భువనేశ్వర్

ఆఖరికి మనుమల తల్లులు కూడా వయసు మాట వచ్చేసరికి సినీనటీమణుల ధోరణికి వచ్చేస్తున్నారు. ఏమిటీ విపరీతం ?

★ విపరీత మేముందండీ, ఆడతనం అనండి.

### ఎన్. టి. ఆర్. – కలకత్తా

నేను బెంగాలీ అమ్మాయిని ప్రేమించాను. ఆమె నన్ను ప్రేమించింది. కాని వాళ్లన్నయ్య పోలీసు. ఎలాగా ?

★ కలకత్తాలో ప్రమాదం జరిగిన చోటు నుంచి పోలీసే ముందు తప్పుకుంటాడని చెప్పుకుంటారే ? మీకెందుకా భయం ?! ★



కళాతపస్వి శ్రీ కర్నాటి లక్ష్మీనరసయ్యకి ఇటీవల విజయవాడలో జరిగిన సన్మానోత్సవ సభలో పుర ప్రముఖులు ఆయనకి 'ప్రజానటుడు' బిరుదుని, బంగారు పతకాన్ని ప్రదానం చేశారు. ఆ సందర్భంగా, రచయిత శ్రీ పొంపల్లి బాపయ్య 'అభినయమాల' ఏకపాత్రాభినయ కృతి సమర్పణ చేస్తున్న దృశ్యం అనేక సంస్థలవారు శ్రీ నరసయ్యని పట్టుబట్టలు, అంగుళీకాలతో సత్కరించి అభినందించారు

# కొత్త సంవత్సరానికి పాతకాలపు ఆయిల్-బౌండ్ డిస్టెంపరా?



## బ్రిటిష్ పెయింట్స్ వైనల్ తెచ్చుకోండి మీ ఇంటి గోడల చేత ఉగాది శుభాకాంక్షలు పలికించండి

కొత్త సంవత్సరం, కొత్త ఇల్లు, ఇంట్లోకి కొత్త పెళ్లికూతురు— ఇన్ని కొత్త శుభ సందర్భాల్లో ఎవరైనా పాతకాలపు ఆయిల్-బౌండ్ డిస్టెంపర్ ఇష్టపడతారా? మీ ఇంటి గోడలకు వైనల్ వెయ్యండి. అవి ఎలా జీవంతో కళకళలాడతాయో చూడండి.

వైనల్ మీ గోడలకు నున్నటి ఫినిష్ ఇస్తుంది, ఖరీదైనవిగా కనిపించేలా చేస్తుంది—మరక పెన్నడూ లేనంతగా! వైనల్ వల్ల మరెన్నో ప్రత్యక్ష ప్రయోజనాలు కూడా—ఏ ఆయిల్-బౌండ్ డిస్టెంపరూ పోటీ పడలేనివి! ఇవన్నీ అదనపు ఖర్చేమీ లేకుండానే.




వైనల్‌ని ఏ ఆయిల్-బౌండ్ డిస్టెంపర్‌తోనైనా పోల్చి చూడండి. ప్రతి విషయంలోనూ అతి శ్రేష్ఠమైనది వైనల్.

| | వైనల్ | ఆయిల్-బౌండ్ డిస్టెంపర్ |
|---|---|---|
| ఫినిష్ | చక్కటిది, నున్నటిది | బాగుండదు |
| ఆరడానికి పట్టే సమయం | 4 గంటలు | 12 గంటలు |
| వాసన | ఇంపైనది | భరించలేనిది |
| కడుక్కొనేందుకు | ఎంతో వీలైనది | వీలుగా ఉండదు |
| రంగు నిలిచి ఉండటం | దీర్ఘం | వెలవారేదు |
| మన్నిక | ఎక్కువ | తక్కువ |
| [illegible] | — లేదు లేదు — | |

... అన్నిటికీ మించిన విషయం: 5 లీటర్ల ఆయిల్-బౌండ్ డిస్టెంపర్ కావలసివచ్చే చోట్లకి, కేవలం 2 లీటర్ల వైనల్ చాలు!

## బ్రిటిష్ పెయింట్స్ వైనల్

ఆనందప్రదమైన తరుణంలో విశిష్టమైన పెయింట్

LINTAS(C)/VNL/86/2317 TL

సీరియల్

# జీవన్మృతులు

ఇంగ్లీషు మూలం: బ్రామ్ స్టోకర్

స్వేచ్ఛానువాదం: కొలను వెంకట దుర్గాప్రసాద్



## జోనాథన్ డైరీ :

అక్టోబర్ 1, ఉదయం 5 గం : మిత్రులతో కలసి పని మీద బయలుదేరాను. మీనా ఎంతో ధైర్యంగా, అనుకూలంగా వుండటంవల్ల, నేను బయలుదేరటం నాకు బాధ అనిపించలేదు. ఆమె ఆగిపోయి, మమ్మల్ని మాత్రమే కార్యరంగంలోకి దూకటానికి ఒప్పుకున్నందుకు నాకు చాలా సంతోషంగా వుంది. అసలు ఆమె ఈ విషయాల్లో చిక్కుకోవడం నాకు బాధగా వుంది. అయినా ఆమె చెయ్యవలసిందంతా చేసింది. రికార్డు తయారుచేసి పెట్టింది. ఇంతకంటే ఆమె ఎక్కువగా చెయ్యాల్సింది లేదు. ఇక ఆమె వూరికే కూర్చుంటేనే మంచిది. మిగతాపని మా భుజాలమీద వేసుకుంటాం.

రెన్‌ఫీల్డు విషయం మాకు కొంత అసంతృప్తిని కలిగించింది. అతని గది నుంచి బయటకు వచ్చి, మా పరిశోధన గదిలోకి వచ్చేవరకు అంతా మౌనంగానే వున్నారు. ఆ తర్వాత మోరిస్ డాక్టర్ సెవార్డుతో అన్నాడు —

''ఏవోయ్ జాక్, అతను చెప్పే విషయంలో ఎంత మాత్రం అబద్ధం లేనట్టయితే, అతనంత తెలివైన పిచ్చివాడ్ని చూడలేదని చెప్పవచ్చు. నాకంత నమ్మకం లేకపోయినా, అతను దేని గురించో బాగా ఆత్రుత పడుతున్నాడనిపిస్తోంది. అదే నిజమయితే, మనం అతని పట్ల కాస్త దారుణంగానే ప్రవర్తించామని చెప్పాలి''

అతను మాటలు విని ఆర్థర్, నేనూ మౌనంగా వున్నాం. వాన్‌హెల్సింగ్ కూడా ఇట్లా అన్నారు —

''మిత్రమా జాన్, పిచ్చివాళ్ల గురించి నాకన్నా

*(గత సంచిక తరువాయి)*

నీకే బాగా తెలుసు. అందుకు సంతోషంగా వుంది. ఎందుకంటే, అతని దీనత్వానికి కరిగిపోయి, నేనయితే ఒప్పేసుకుని వుండేవాడ్ని. కానీ మనం కొన్ని జాగ్రత్తగా చూసి నేర్చుకోవాలి.. ఇప్పటి మన విధి నిర్వహణలో దేనినీ తేలికగా తీసుకోకూడదు. మన మిత్రుడు మోరిస్ చెపుతుంటాడే, అట్లా — అంతా మన మంచికే అనుకోవాలి''

''మీరు చెప్పింది బాగానే వుంది. అతను మామూలు పిచ్చివాడయితే, అతన్ని వదిలేయటానికి సంశయించే వాడ్ని కాదు. కానీ అతని బుర్ర డ్రాకులాతో నిండి వుంది. అతని ప్రవర్తన బట్టి డ్రాకులా రాకపోకలు తెలుస్తాయి. అతన్ని వదిలేస్తే ఇబ్బంది అనుకుంటున్నాను. అతను ఎంత వేడుకున్నాడో మరచిపోలేను. పిల్లి కోపం కూడా అతను అట్లాగే ప్రాధేయపడ్డాడు.. కాదనగానే నామీద పడి నోటితో నాగుండెను చీల్చడానికికూడా ప్రయత్నించాడు. అదికాకుండా, డ్రాకులాను 'ప్రభువు', 'యజమాని' అని సంబోధించాడు. ఇతన్ని బయటకు పంపిస్తే, డ్రాకులాకు సహాయపడవచ్చు. ఆ డ్రాకులాను, తోడేళ్లు, ఎలుకలు, అటువంటివాళ్లు సహాయపడుతుంటారు. అందువల్ల అతను బయటపడటానికి, తను పిచ్చివాడ్నికానని నమ్మించటానికి చూస్తున్నాడు. అతనికి పిచ్చి లేకపోవచ్చు. అయినా మనకేది మంచిదో అదే చేసాననుకుంటున్నాను. ఇట్లాంటి విషయాలు, మనం కర్తవ్య నిర్వహణలో వుండగా, చికాకును కలిగించటానికే'' అన్నాడు డాక్టర్ సెవార్డు, ఎంతో ఆలోచనలో వుండి మాట్లాడుతున్నట్టుగా.

ప్రొఫెసర్ వాన్‌హెల్సింగ్ ఒక అడుగు ముందుకువేసి, డాక్టర్ సెవార్డు భుజంమీద చెయ్యి వేసాడు. ''మిత్రమా జాన్, భయపడకు. మన పని మనం భయంకర పరిస్థితుల్లో దిగులుతో చేస్తున్నాం. మనకి ఏది మంచిదనిపిస్తే అది చేస్తాం. ఇక అంతకంటే చేసేదేముంది దేవుడిమీద భారంవేసి వూరోకవడంతప్ప'' అన్నాడు గంభీరంగా.

మాటలు జరుగుతుండగా ఆర్థర్ కొన్ని క్షణాలు బయటకువెళ్లి తిరిగివచ్చాడు. అతని చేతిలో వెండి ఈల వుంది.

''మనం వెళ్లబోయేచోటు ఎలుకలతో నిండి వుండొచ్చు. ఈ ఈల పిలవటానికి పనికొస్తుంది'' అన్నాడు.

గోడదాటి, ఇంటివేపుకు దారిపట్టాం. వెన్నెల వెలుగులో చెట్లనీడల్లో ఎవరికీ కనపడకుండా జాగ్రత్త తీసుకుంటూ నడుస్తున్నాం. ఇంటి వసారా దగ్గరకు చేరుకున్నతర్వాత, ప్రొఫెసర్ తన సంచీని తెరిచాడు. అందులోంచి చాలా సామానులు బయటకు తీసాడు. వాటినన్నిటినీ వసారా మెట్టుమీద నాలుగు భాగాలుగా పేర్చాడు — ఒక్కొక్కరికీ ఒక్క భాగం చొప్పున.

''మిత్రులారా ! ఇప్పుడు మనంగొప్ప ప్రమాదమైన చోటుకు వెళుతున్నాం. మనకు రకరకాలైన ఆయుధాలు అవసరం. మనశత్రువు కేవలం దయ్యం కాదు. ఓ విషయం గుర్తుపెట్టుకోండి. అతనికి ఇరవైమందికున్న బలంవుంది. మన మెడలు చాలా సామాన్యమయినవి. లాగితే వూడివచ్చేస్తాయి. పిసిగితే పచ్చడవుతాయి. కేవలం బలంతో అతన్ని పడకొట్టలేం. అతను చాలా బలవంతుడు. ఎంతో మంది కలిపినా అతన్ని దెబ్బతీయలేరు. అతను మనల్ని సులభంగా దెబ్బతీయగలడు. అందువల్ల మనం అతని చేతికి దొరక్కుండా వుండాలి. ఇది మీ గుండెకుదగ్గరగావుంచుకోండి''అంటూవాన్‌హెల్సింగ్ ఒక వెండి శిలువను తీసి నాకు ఇచ్చాడు, నేను దగ్గరగా వుండటంవల్ల. ''ఈ వెల్లుల్లిపాయల దండ మెళ్లో వేసుకోండి'' అన్నాడు, ఒక దండను నాకిస్తూ. ''ఇతర శత్రువులకోసం, ఈ రివాల్వర్, ఈ కత్తి వుంచుకోండి. మనందరికోసం ఈ విద్యుద్దీపాలు. వీటిని మీ గుండె దగ్గర పెట్టుకోవచ్చు.

---

**జరిగిన కథ — 27 :** ఆ రాత్రికి లూసీ సమాధి దగ్గరకు వచ్చి చూస్తే దాంట్లో ఆమె కనిపించదు. చర్చి ఆవరణలో పొంచివున్న సెవార్డ్‌కి లూసీ కనిపిస్తుంది. వాన్‌హెల్సింగ్‌కి దొరికిన పసిపాపను పోలీసులకి అప్పగిస్తారు. కానీ ఆ పాప మెడపై గాట్లు లేకపోవడం గమనిస్తారు. ప్రొఫెసర్ వాన్‌హెల్సింగ్ ఉత్తరం ద్వారా ఆర్థర్‌ను, క్విన్సీమోరిస్‌లను రప్పిస్తాడు. వాళ్లకి కూడా సెవార్డ్‌కి చూపించిన దృశ్యాన్ని చూపిస్తాడు. ఆర్థర్‌ని గుర్తుపట్టిన లూసీ అతన్ని చేరుకోబోయేంతలో వాన్‌హెల్సింగ్ అడ్డుపడతాడు. లూసీ సమాధిలోకి వెళ్తుంది. లూసీ శరీరంలో ప్రవేశించిన రాక్షసిని హతమారుస్తాడు ఆర్థర్, వాన్‌హెల్సింగ్ చెప్పిన విధంగా. జోనాథన్ డైరీ చదివి కొన్నివిషయాలు తెలుసుకుంటాడు డాక్టర్ సెవార్డ్. జోనాథన్ 'డ్రాకులా' గురించిన వివరాలను సేకరిస్తుంటాడు. మినాహార్కర్ తనకు తానే మిస్టర్‌రెన్‌ఫీల్డ్‌కు పరిచయం చేసుకుంటుంది. డాక్టర్ వాన్‌హెల్సింగ్‌కు మినా తన డైరీని ఇస్తుంది. పవిత్రమైన బుల్లెట్‌తో డ్రాకులా శవపేటికను పేల్చితే అతను నిజంగా చనిపోతాడని చెపుతాడు వాన్‌హెల్సింగ్. వాన్‌హెల్సింగ్, మోరిస్, జోనాథన్ మినాను వదిలి కార్యక్రమంలోకి దిగుతారు. డాక్టరు సెవారు ఆర్థర్, వాన్‌హెల్సింగ్, మోరిస్‌లకు రెన్‌ఫీల్డ్‌ను పరిచయం చేస్తాడు.

ఇకపోతే, అన్నిటికంటే ముఖ్యమయినదీ, మనందరికీ పనికి వచ్చేది, దీన్ని మరచిపోకూడదు'' అంటూ కొంత పిండిని ఒక కవరులో వేసి మడతపెట్టి నాకిచ్చాడు వాన్ హెల్సింగ్. అందరికీ అన్ని వస్తువులూ అట్లాగే ఇచ్చాడు. ''ఇక, మిత్రమా జాన్! ఆ మారు తాళం గుత్తి ఏది? అవి వుంటే, ఈ తలుపు తెరవచ్చు. కిటికీ బద్దలు కొట్టనక్కర్లేదు, అప్పుడు 'లూసీ' గదిలోకి జొరపడినట్టుగా'' అన్నాడు.

డాక్టర్ సెవార్డు రెండు మూడు తాళపు చెవులతో ప్రయత్నించాడు. అతను సర్జన్ కావడంవల్ల, అతను చురుకుగా చేస్తున్నాడు. కొంత ప్రయత్నించిన తర్వాత, తాళం వూడింది. బాగా తుప్పపట్టిన గడియ చప్పుడు చేసింది. తలుపు తోసాం. బందులు బాగా తుప్పపట్టి వుండటంవల్ల, కిర్రుమని చప్పుడు చేస్తూ తెరుచుకుంది. డాక్టర్ సెవార్డు డైరీలో రాసుకున్నట్టుగా, లూసీ సమాధిలోపల ఎట్లావుందో, ఇక్కడా అట్లాగే వుంది. అందరికీ అట్లాగే అనిపించి వుండాలి. అందరూ ఒక్కసారి వెనక్కి తగ్గారు. మొట్టమొదటగా ప్రొఫెసర్ ముందు నడిచాడు. తలుపుదాటి లోపలికి వెళ్లాడు.

''దేవుడా, మమ్మల్ని కాపాడు''అంటూ దేవుడ్ని తలుచుకుంటూ లోపలికి వెళ్లాడు. మేం కూడా లోపలికొచ్చి తలుపు వేసేశాం. తర్వాత మా దీపాలు వెలిగించాం. లేకపోతే, రోడ్డుమీద పోయేవాళ్ళు చూడగలరు. ప్రొఫెసర్ తలుపుకు తాళంపెట్టి వుంచాడు, మేం గబగబా బయటకు వెళ్లడానికి వీలులేకుండా. వెలిగించిన దీపాలతో ముందుకు సాగాం.

మా దగ్గరున్న చిన్న దీపాల వెలుగు తాలుకు నీడలు ఏవేవో వింత ఆకారాలను సృష్టిస్తున్నాయి. వాళ్లోపాటు మరి కొందరు వున్నారన్న ఆలోచన నాకు ధైర్యాన్ని కలిగిస్తోంది. ఈ వాతావరణం చూస్తుంటే, పాత విషయాలన్నీ మళ్ళీ బుర్రలోకి వస్తున్నాయి. ట్రాన్సిల్వేనియాలో నా అనుభవాలన్నీ గుర్తుకు తెస్తున్నాయి. నేను ఎట్లా ఆలోచిస్తున్నానో, మిగతా వాళ్ళుకూడా అదే పరిస్థితిలో వున్నట్టు కనిపించారు. ఏ చిన్న శబ్దం అయినా, ఎటువంటి నీడ కనిపించినా, ఆతృతగా చూస్తున్నారు.

ఆ ప్రదేశమంతా బాగా మందంగా దుమ్ము కొట్టుకుపోయింది. అక్కడక్కడా పాద ముద్రలు కనిపించాయి. గోడలు కూడా బాగా దుమ్ముతో నిండిపోయాయి. గోడమూలల్లో సాలెపురుగులు వాటి గూళ్లతో నిండివున్నాయి. ఆ గదిలో ఒకపెద్ద బల్ల వుంది. దానిమీద తాళాల గుత్తి కనపడింది. ప్రతి తాళం చెవికి చిన్న చీటీ రాసి వుంది. ఆ తాళం చేతులు ఎన్నోసార్లు ఉపయోగించినట్టుగా తెలుస్తోంది, అక్కడ దుమ్ము తాలుకు గుర్తుల్నిబట్టి.



# జీవన్మృతులు

వాన్‌హెల్సింగ్ ఆ తాళాల గుత్తిని పైకి తీసాడు. మారిస్ తిరిగి అన్నాడు —

"జోనాథన్! మీకు ఈ చోటు తెలుసుకదూ? దీని తాళుకు పటాలు కూడా తయారుచేసారు. కాబట్టి మా కన్నా మీకే బాగా తెలుస్తుంది ఈ చోటు గురించి. పాతబడిన చర్చికి దారెటు?"

దారి గురించి నాకు కొంత తెలుసు, ఇంతకి ముందు ఒకసారి వచ్చి లోపలికి వెళ్లకపోయినాకూడా. నేను ముందుకు నడిచాను. కొన్నిచోట్ల తప్పుడు మలుపులు తిరిగి, చివరకు ఒక చిన్న తలుపు దగ్గరకు చేరుకున్నాం. దానికి ఇనుప బద్దీలు వున్నాయి. "ఇదే మనకు కావలసింది" అన్నాడు వాన్‌హెల్సింగ్, దీపం వెలుగులో ఆ ఇంటి తాలుకు పటాన్ని పరీక్షిస్తూ. ఆ ఇంటి కొనుగోలు నిమిత్తం తయారు చేయబడిన పటానికి నకలు అది. కాస్త ఇబ్బంది పడ్డా, మొత్తానికి మా దగ్గరున్న తాళాలతో ఆ తలుపు తెరిచాం. లోపలికి వెళితే కష్టాలు ప్రారంభమవుతాయని మాకు తెలుసు. తెరవగానే భరించరాని, మెలికలు తిరిగి పడిపోయేటంత వికారపు వాసన వచ్చింది. అట్లాంటి వాసన వస్తుందని ముందుగా మేం వూహించలేదు. మిగతావాళ్ళు ఎవరూ ఇంత వరకు డ్రాకులాను దగ్గరగా చూడలేదు. నేను మాత్రం అప్పుడు అతన్ని బయటకు వెళుతుండగా చూడడమో, బాగా రక్తం తాగి అతను పడుకొని వుండగా చూడడమో జరిగింది. అక్కడి గదులు కాస్త విశాలంగానే వున్నాయి, గాలి రావటానికి పోవటానికి వీలుగా. ఇక్కడి ఇల్లు మాత్రం చాలా చిన్నది పైగా ఇరుకుగా వుంది. అందువల్లనే అనుకుంటా దుర్వాసన వస్తోంది. ఆ వాసనని ఎట్లా వర్ణించను? దానిలో సకల రోగాలు వున్నట్టు, రక్తపు వాసనతో కూడుకుని వుంది. ఎంత రోతగా వుందో చెప్పలేను.

మామూలు పరిస్థితిలో వచ్చినట్టయితే, వెంటనే అందరం అక్కడ్నించి అన్నీ మూసుకుని పారిపోయే వాళ్లం. కానీ మా కర్తవ్యం వేరు. అన్నింటికీ తెగించి బయలుదేరిన వాళ్లం, ఇట్లాంటి చిన్న విషయాలకు అసహ్యించుకుని కూర్చుంటే ఎలా? ఇక దాని సంగతి మరచిపోయి, పూర్తిగా కర్తవ్య నిర్వహణలో పడిపోయి, ఒక నందన వనంలో నడుస్తున్నట్టుగా ముందుకు సాగిపోయాం.

అక్కడ అంతా జాగ్రత్తగా పరీక్షిస్తుండగా వాన్‌హెల్సింగ్ అన్నాడు —

"ముందు ఇక్కడ ఎన్ని పెట్టెలు వున్నాయో చూడాలి. తర్వాత ప్రతి అంగుళం, ప్రతిమూల పరీక్షద్దాం, మిగతా పెట్టెల కోసం." ఒక్కసారి చూడగానే అక్కడ ఎన్నిపెట్టెలున్నాయో చెప్పవచ్చు. అక్కడ అలా పేర్చి వుంచబడ్డాయి.

అక్కడ యాభయికి ఇరవై తొమ్మిది పెట్టెలు మాత్రమే వున్నాయి. ఆర్థర్ హఠాత్తుగా అక్కడ మూసివున్న తలుపు నొకదాన్ని తెరిచి, సన్నటి చీకటి దారిలోకి చూడగానే నాకు ఒళ్లు జలదరించింది. నేను కూడా ఆ చీకట్లోకి చూసాను, ఒక్కసారి గుండె ఆగినట్టయింది. ఆ చీకట్లో ఏదో ఒక నీడ కనపడింది. అందులో డ్రాకులా క్రూరమైన మొహంలోని గుర్తులు గోచరించాయి. పొడుగాటి ముక్కు, ఎర్రటి—కళ్లు, రక్తం లాంటి, పెదాలు, కోరలు. ఒక్కక్షణం అట్లా భ్రమలో వున్నాం ఆర్థర్ అన్నాడు "ఏదో ఒక మొహాన్ని చూసినట్టు అనిపించింది. కానీ అది కాదు, నీడలు మాత్రమే" అతను కాస్త ముందుకు వెళ్లాడు. అతను నడుస్తున్న దారిలో దీపాన్ని చూపించాను. ఆ దారి వెంట నడిచాం. అక్కడ ఎవరూ కనిపించలేదు. అక్కడ మరో దారి కానీ, మరో మూలగానీ, మరో తలుపు గానీ లేవు. రెండు వేపులా గోడలు, మధ్యలో సన్నటి దారి తప్ప మరేమి లేదు. అక్కడ ఎవరూ దాక్కోటానికి చోటు లేదు. డ్రాకులా కూడా అక్కడ దాక్కోలేదు. ఏదో భయం ఆవహించి అట్లాంటి భ్రమలో పడివుంటాం అనిపించింది.

కొన్ని నిముషాల తర్వాత మోరిస్ ఒక మూల నుండి హఠాత్తుగా వెనక్కి రావటం చూసాను అతను ఆ మూలను పరిశీలిస్తున్నాడు. అందరి దృష్టి అతని మీద పడింది. ఏమిటో తెలీని ఆతృతతో అటువేపు చూస్తున్నాం. అక్కడ ఏదో తళతళలాడే మెరుపుల పోగు కనపడింది. అందర్మం వెనక్కి అడుగులు వేసాం ఒక్కసారిగ. అది ఎలుకల పోగు. అవన్నీ ఒక్కసారి కదిలినాయి. మెరిసినవి వాటి కళ్లు.

మా ఒళ్ళు జలదరించింది అని కదలగానే ఆర్థర్‌కి వీటిగురించి ముందే తెలుసు అనుకుంటాను. అందుకే వెంట ఈలను తెచ్చాడు. అతను గబగబా ఇనపబద్దలతోవున్న అక్కడి తలుపు తాళంతీసి, తలుపు రెక్కలు తెరిచాడు. వెంటనే తన జేబులో వున్న వెండి ఈలను తీసి మెల్లగా వూదాడు. జవాబుగా డాక్టర్ సెవార్డు ఇంటివైపు నుండి కుక్కల అరుపు వినవచ్చింది. ఒక నిముషం తర్వాత మూడు కుక్కలు పరుగెత్తుకుంటూ ఈ ఇంటి వేపుకు వచ్చాయి మాకు తెలియకుండానే మేమంతా బయట తలుపుదగ్గరకు వెళ్ళాం మేం కదిలినపుడు నేలమీద దుమ్ము అంతా చెదిరినట్టు గమనించాం. బయటకు పంపబడిన పెట్టెలన్ని, ఈ దారిన తీసుకొచ్చి వుండాలి. అక్కడున్న ఒక్క నిముషంలోనే ఎలుకలసంఖ్య విపరీతంగా పెరిగింది. అవి అటూ ఇటూ పరుగెత్తడం మొదలెట్టాయి. బయటనీది దీపం వెలుగులో, ఈ ఎలుకల నల్లటి చర్మం మెరవసాగింది, వాటి కళ్ళు తళ తళమన్నాయి. కుక్కలు దూసుకువచ్చేశాయి.. కానీ అవి గడపదగ్గర కొచ్చేసరికి హఠాత్తుగా ఆగిపోయి గుర్రుమన్నాయి. వెంటనే తలలు పైకెత్తి దిగులుగా అరిచాయి. ఇక ఎలుకలు వేనకువేలు పెరగసాగాయి. మేం బయటకు వచ్చేశాం.

ఆర్థర్ ఒక కుక్కను ఎత్తుకుని లోపలికివెళ్లి దానిని నేలమీద వదిలిపెట్టాడు. ఆ కుక్క నేలమీద నిలబడగానే, దాని పూర్వపు శక్తి వచ్చినట్టుగా, ఎలుకలమీద పడింది. దాంతో ఎలుకలు పారిపోవటం మొదలెట్టాయి. ఈలోపున, మిగతారెండు కుక్కల్నీ ఆర్థర్ లోపలికి ఎత్తుకుని తీసుకెళ్ళి వదిలాడు. ఏవో కొన్నితప్ప, అన్ని ఎలుకలు కనిపించకుండా పోయాయి.

అవి వెళ్ళిపోగానే, ఏవో దుష్టశక్తులు అక్కడ్నించి పారిపోయినట్టుగా, కుక్కలు సంతోషంగా అరిచాయి. వాటికి దొరికిన ఎలుకలను చించి చెండాడాయి. మాక్కూడా కొంత ఉత్సాహం వచ్చింది. బయట తలుపుతీయడంవల్లనో, మరి మేమంతా ఆరుబయట వుండటంవల్లనోగానీ, మాలో వున్న భయం అంతాపోయి, ఎంతో ధైర్యంగా వూపిరి పీల్చాం. బయట తలుపువేసి తాళం బిగించాం కుక్కల్ని తీసుకుని ఇంటిచుట్టూ పరిశీలించడం మొదలెట్టాం. ఇంటి చుట్టూ దుమ్ముతప్ప మరేం కనిపించలేదు. వాటిమీద మా అడుగుజాడలు తప్ప మరొకరివి లేవు. కుక్కలుకూడా ఎటువంటి వికార చేష్టలు చేయలేదు.

ఇటీవల కళాతరంగిణి (విజయవాడ)వారు 'సామాన్యులకోసం వైద్యం' పుస్తకావిష్కరణ — అంకిత సత్కారసభ, అనంతరం సంగీత విభావరి ఏర్పాటు చేశారు. ఆ సందర్భంగా కృతికర్త డాక్టర్ పి. వి. సుబ్బారావుని పుష్పమాలాంకృతుణ్ణి చేస్తున్న కృతి భర్త శ్రీపాతుని సాంబమూర్తి (హోటల్ బాబాయి), సంగీత విభావరిలో పాల్గొన్న సుప్రసిద్ధ నేపథ్య గాయకుడు శ్రీ మాధవపెద్ది, యువ గాయకుడు డా. అశోక్‌లని చిత్రంలో చూడవచ్చు.



# సంపూర్ణ పోషకాహారంలో అన్ని పోషక పదార్థాలు సరియైన పాళ్ళలో వుండాలి...



# సిరిలాక్ సంపూర్ణ పోషకాహారాన్ని సిద్ధం చేస్తుంది— రుచికరమైన విధంగా.

మీ పాపకి నాలుగు నెలలు నిండి ఘన పదార్థాలు తీసుకోడానికి సిద్ధంగా వున్నప్పుడు, సిరిలాక్ గురించి మీ డాక్టర్‌ని సంప్రదించండి. మీ పాపకి సిరిలాక్ ఆహారంగా యిచ్చిన ప్రతి పర్యాయము సంపూర్ణ పోషకాహారం యిచ్చామనే నమ్మకం మీకు మరొకసారి కలుగుతుంది.

అనగా సిరిలాక్ యిచ్చిన ప్రతి పర్యాయము ఒక ఘన ఆహార పదార్థం నుంచి అవసరమైన అన్ని పోషకాలు. మాంసకృత్తులు, కాలరీలు, పాపకి లభిస్తున్నట్లే. అది యిస్తూ పోషక పదార్థాల లోపం తొలగించడానికి మరొకటి ఇవ్వవలసిన అవసరం లేదు.

గోధుమ పిండి, పూర్తి మీగడ పాలు, పంచదార రుచికరంగా కలిపి వుండడం చేత సిరిలాక్‌కి ఈ సంపూర్ణ పోషకత్వం, రుచి లభించాయి. శరీర నిర్మాణానికి మాంసకృత్తులు, శక్తికి పిండి పదార్థాలు, క్రొవ్వు పదార్థాలు, అన్ని విధాల పెరుగుదలకి అత్యంత అవసరమైన విటమిన్లు, ఖనిజాలు సిరిలాక్ అందచేస్తుంది.

మీ పాపకి సిరిలాక్ యివ్వండి—పాప బాగుగా, ఆరోగ్యంగా పెరగడానికి.




# సిరిలాక్®

పాలు వుండనే వున్నాయి



సిరిలాక్ తయారు చేయడం ఎంతో సులభం. దీనిని ముందుగా మరగబెట్టిన, గోరువెచ్చటి నీటికి చేర్చండి. కలపండి వడ్డించండి.

SAA/FSL/C/2670 TEL

NESTLÉ

# జీవన్ మృతులు

అక్కడ్నించి మేం కదిలేసరికి తెల్లవారసాగింది. డాక్టర్ వాన్‌హెల్సింగ్ తాళాలగుత్తిలోంచి ఇంటి తాళంతీసి, తాళాన్ని సరిగా వేసిందీ లేనిదీచూసి, ఆ తాళంచెవిని జేబులో వేసుకున్నాడు.

"ఇప్పటివరకు మనపని విజయవంతంగా జరిగినట్టే. మనకి ఏదైనా ప్రమాదం వాటిల్లుతుందేమోననుకున్నాను. అటువంటిదేమీ జరగలేదు. కానీ, ఎన్ని పెట్టెలు మాయమయినాయో మనం తెలుసుకోవాలి. కానీ ఒక్కవిషయం నాకు సంతోషాన్ని కలిగిస్తోంది. మనం ఏదో ప్రమాదానికి లోనై, అరుపులు గావుకేకలు పెట్టగా, అది మినా విని బెంబేలెత్తిపోలేదు. ఇప్పుడు మనకి మరో విషయం కూడా తెలిసింది. డ్రాకులా తోడేళ్ళను, ఎలుకలను పిలవగల శక్తివున్నా, వాటిని మనం ఎదుర్కోగలం. ఇప్పుడు చూడండి, కుక్కలు రాగానే, ఎలుకలు ఎట్లా పారిపోయ్యాయో. అయినా మన ముందర కొన్ని చిక్కులున్నాయి. అతని శక్తి ఉపయోగించడంటే మాత్రం ప్రమాదమే. ఈ రాత్రి అతను తన శక్తిని ఉపయోగించలేదు. ఈ చదరంగంలో గెలుపుకు అవకాశం వున్నట్టుగా కనపడుతోంది. ఇక వెళదాం పదండి. సూర్యోదయం కావస్తోంది. ఇప్పటివరకు చేసింది సంతృప్తికరంగానే వుంది. ఇక ముందు గడిపే రాత్రిళ్ళు, పగలు, పూర్తి భయానకమైనది. ఎటువంటి భయాలెదురయినా, జంకక ముందుకు సాగిపోదాం" అన్నాడు వాన్‌హెల్సింగ్.

మేం ఇంటికి తిరిగి వచ్చేసరికి అంతా నిశ్శబ్దంగా వుంది, ఏవో చిన్న చిన్న జంతువుల చప్పుడు తప్ప. రెన్‌ఫీల్డు గదిలోంచి మాత్రం కాస్త మూలుగు వినిపిస్తోంది. అతను మళ్ళీ పిచ్చిలో పడివుంటాడు.

నేను మెల్లగా అడుగులో అడుగువేసుకుంటూ మినా వున్న గదిలోకి వెళ్ళాను. ఆమె గాఢంగా నిద్రపోతోంది. ఆమె వూపిరి తీయటం విన్నాను. మామూలుగాకన్నా ఆమె మొహం కాస్త పాలిపోయి వుంది. ఒకవేళ మా గురించి ఆమె భయపడటం లేదు గదా అనిపించింది. ఏమయినా, ఆమెను ఈ విషయాల్లో ఆలోచించనీయకుండా చెయ్యాలి. ఒక స్త్రీగా ఆమె భరించలేని సంగతులు ఇవి. ఇప్పుడు మేం వెళ్ళి ఏం చేసామోకూడా చెప్పకుండా వుంటే సరి. ఇందులో ఆమెను కొన్ని భయం కలిగించే సంగతులు వుండొచ్చు. అవసరమయినప్పుడే ఈ విషయాలు చెప్పవచ్చు. వీలయితే ఆ డ్రాకులా బూమ్మీదనుండి పోయినప్పుడే చెప్పవచ్చు. అంతదాకా ఈ విషయాల గురించి నోరు మెదపకూడదు. ఇక్కడ సోఫాలో పడుకుంటాను, ఆమె నిద్ర చెడకుండా.

అక్టోబర్ 1, తర్వాత : మేం బాగా నిద్రపోయాం. మినా కూడా బాగా అలసిపోయినట్టు వుంది. బాగా పొద్దు ఎక్కేవరకు నేను నిద్రపోయినా, ఆమె కంటే ముందే లేచాను. ఆమెను నిద్రలేపటానికి రెండు మూడుసార్లు పిలవాల్సి వచ్చింది. ఆమె మొద్దు నిద్రపోయి వుండాలి. నేను నిద్రలేపినప్పుడు మగతగా చూసి, నన్ను గుర్తుపట్టలేకపోయింది. ఏదో పీడకల నుంచి తప్పించుకునట్టుగా, నా వంక భయంతో చూసింది. బాగా అలసిపోయానని చెపితే, సరే విశ్రాంతి తీసుకోమని చెప్పాను.

ఇప్పటి వరకు ఇరవై ఒక్క పెట్టెలు అక్కడ్నించి పోయినట్టు తెలుసు. అవి ఎక్కడకు పోయాయో తెలుసుకోవాలి. ఇవాళ థామస్ స్నెల్లింగ్‌ను చూడాలి.

## డాక్టర్ సెవార్డు డైరీ :

అక్టోబర్, 1 : మిట్టమధ్యాహ్నానికికాస్త ముందు ప్రొఫెసర్ వాన్‌హెల్సింగ్ వచ్చి నన్ను నిద్రలేపాడు. అతను చాలా హుషారుగా వున్నాడు. రాత్రి మేం చేసిన పని అతని బుర్రలోవున్న కొన్ని సందేహాలను పోగొట్టినట్టు వుంది. ఆ విషయాలు మాట్లాడుతూ ఇట్లా అన్నాడు —

"మీ పేషంటు విషయం నాకు చాలా కుతూహలంగా వుంది. నీతోపాటు వచ్చి అతన్ని నేను ఇప్పుడు చూడొచ్చా? లేకపోతే నీకు వేరే పని వుంటే, నేనే వెళ్ళి చూస్తాను. ఓ పిచ్చివాడు తత్వం మాట్లాడ్డం, అది కూడా చక్కని కారణాలతో"

నాకు వేరే పనులున్నాయి. అతను ఒక్కడే వెళ్ళినా నాకు సంతోషమే అని చెప్పాను. అతన్ని ఎక్కువసేపు వేచివుండటం బాగోదని, వెంటనే ఓ పనివాడ్ని పిలిచి, వాడికి కొన్ని సూచనలిచ్చి వాన్‌హెల్సింగ్‌తో పంపించాను. అతను వెళ్ళేముందు, ఆ పేషంటు గురించి తొందరపడి ఎటువంటి మంచి అభిప్రాయం పెట్టుకోవద్దని హెచ్చరించాను. "కాని నేను అతనితో మాట్లాడాలి. ముఖ్యంగా, అతను పూర్వం చేసిన క్రిమికీటకాది భక్షణ గురించి, ఈ విషయం అతను మేడమ్ మినాకు కూడా చెప్పాడు కదా. ఏమిటే నవ్వుతున్నావ్, జాన్ ?" అన్నాడు.

"క్షమించండి ! దానికి జవాబు, ఇదిగో ఇక్కడుంది" అన్నాను, టైపు చేసిన కాగితం ఒకటి చేత పట్టుకుని. "అతను పూర్వం ఎప్పుడో ఒక్కసారి తిని మానేయలేదు. తరుచూ చేస్తూనే వుండేవాడు. మేడమ్ మినా అతన్ని కలుసుకున్న కొద్ది నిముషాల క్రితమే, అతను కొన్ని ఈగల్ని, సాలెపురుగుల్ని నమిలి మింగాడు," అన్నాను మళ్ళీ.

వాన్‌హెల్సింగ్ నవ్వాడు "బాగుంది. నీకు జ్ఞాపకశక్తి ఎక్కువ. నేనే ఆ విషయం మర్చిపోయాను. అయినా అతని ఈ క్రూరమైన చర్యలు, ఆలోచనలు పరిశీలించాలని వుంది. నేను బుర్ర సరిగా వున్నవాళ్ళకు ఏవేవో బోధిస్తుంటాను. కానీ, ఇలాంటి పిచ్చివాళ్ళ దగ్గరే నేను నేర్చుకోవలసింది చాలా వుందేమో, ఎవరికి తెలుసు?" అన్నాడు. నేను నా పనిలో మునిగిపోయాను. సమయం తెలీలేదు. వాన్ హెల్సింగ్ కాసేపట్లో తిరిగి వచ్చినట్లు అనిపించింది. "ఏమిటి పనిలో వున్నావా ?" అన్నాడు తలుపు దగ్గరే నిలబడి.

"ఏం లేదు, రండి. ఇప్పుడే ముగించాను. ఎక్కడికైనా వెళదామనుకుంటే, వెళదాం" అన్నాను.

"అక్కర్లేదు. అతన్ని చూసి వస్తున్నాను."

"బావున్నాడా ?"

"అతకు నాతో మాట్లాడటానికి అంతగా ఇష్టపడటంలేదు. కొద్దిసేపే మాట్లాడుకున్నాం. నేను అతని గదిలోకి వెళ్ళేసరికి మోకాళ్ళమీద మోచేతులానించి, గది మధ్యలో స్టూలు మీద

# ఉచితం




## ఒక క్యాడ్‌బరిస్ జెమ్స్ ప్యాక్
## బోర్న్‌విటా యొక్క 500గ్రా. ప్యాక్‌తోబాటు

ప్రత్యేకమైన కానుక! ప్రత్యేకమైన లేబుల్‌గల 500 గ్రా. బోర్న్‌విటా డబ్బా లేదా రీఫిల్ ప్యాక్ అడిగి తీసుకోండి! దీనిలోపల ఉండే క్యాడ్‌బరిస్ జెమ్స్ యొక్క ఉచిత ప్యాక్ పొందండి.







క్యాడ్‌బరిస్

# బోర్న్‌విటా

దీన్లోని మంచిదనం పెరుగుతుంది మీపైనిక

OBM/1083/TL



బ్రహ్మగిరి వద్ద జలపాతంలా గుండంలో పడుతున్న కావేరీనది.

# కావేరినది విశిష్టత

పవిత్రమైన కావేరీనది ఉద్భవించిన ప్రదేశం మైసూరుకి 120 కి. మీ. దూరంలో ఉంది. అక్కడకు వెళ్ళే దారిపొడుగునా కాఫీ తోటలు, టీ తోటలు వంటివి కనుల పండుగగా ఉంటాయి. మైసూరు నుంచి "హస్ మార్, ప్రియ పట్నా" అనే ఊర్లను దాటి కుషాల్ నగర్ సమీపించేసరికి విపరీతమైన చలి వేస్తుంది. తెల్లని మబ్బులు కొండల్ని ఢీకొంటూ అక్కడక్కడ దిగజారుతున్న వెండి కడ్డీల వంటి కొండ ఊటలు తుంపరులూ, రకరకాల పండ్ల పూల తోటలు, పచ్చని నేల, కొండలు, వాగులు, లోయలు ప్రయాణపు శ్రమను తెలియనివ్వకుండా మనసుకి హాయినిస్తాయి.

మెర్కారాలోను, మెర్కా పరిసరాలలోను నివసిస్తుండే ప్రజలకు కన్నడ భాష మాతృభాషయినా అందులో తుళు, కేరళ భాషలు కూడ మిశ్రమమై ఉంటాయి. ఈ ఊరి ప్రజలు పుష్టికరంగాను, ఆరోగ్యంగాను, నిరాడంబరంగాను ఉంటారు. మెర్కాలో ఓంకారేశ్వర ఆలయం ఉంది.

మేఘమండల అందమయిన ఊరు. ఒక దిక్కునుంచి కావేరీ ప్రవహిస్తే రెండవ దిక్కునుంచి "కనకా" నది ప్రవహిస్తుంది.

కావేరీ పడమట కనుమల వద్దనున్న పాషాణం పైనబడి తటాకంలా రూపొందుతుంది. అక్కడనుంచి అఖండ కావేరిగా అటు కర్నాటకలోను, ఇటు తమిళనాడులోను ప్రవహిస్తూ భూమిని సశ్యశ్యామలం చేస్తూంది. ఈ కావేరీ పవిత్రమైన పుణ్యనది.

తీసుకుంటె ఈ క్రింది విధంగా ఒక కథ ఉంది. బ్రహ్మగిరి వద్ద కావేర మహర్షి పుత్రికా సంతానం కోసం ఘోర తపస్సు చేసారు. ఆయన భక్తికి మెచ్చి బ్రహ్మలోక శ్రేయస్సుకోరి విష్ణుమాయ అనే తన మానస పుత్రిక లోపాముద్రను కావేర మహర్షికి దత్తం చేశారు. తరువాత ఆ ప్రాంతాలకు వచ్చిన అగస్త్యమహర్షి లోపాముద్రను వివాహం చేసుకున్నారు. తరువాత ఆమె తనలోని అంశాన్ని తీర్థంగా మార్చుకొని మహర్షి కమండలంలో ఇమిడిపోయారు. భార్య శక్తిని గ్రహించిన మహర్షి "ఇంతటి శక్తివంతురాలైన నీవు లోకానికి ఉపకరించే పద్ధతిలో ప్రవహించాలే గాని ఇలా ఈ కమండలంలో అణిగిపోయి ఉండకూడదు" అని ఆజ్ఞాపించాడు. వెంటనే ఉత్సాహంతో ఉరకలు వేస్తూ కమండలం నుంచి బయటికి పొంగి పాషాణ గుండంలోకి జలపాతంగా దూకేసింది. కావేర మహర్షికి దత్తపుత్రిక అవడంవల్ల ఆ తీర్థానికి కావేరీ తీర్థం అని పేరొచ్చింది.

కావేరీ జలం అన్ని రకములైన పంటలకు అమోఘమైనది. అటు మైసూరులోను, మెర్కాలోను తయారయ్యే విద్యుచ్ఛక్తి కావేరీ జలపాతాల ఆధారంతోనే తయారవుతున్నది.

కుడగుదేశంలో బ్రహ్మగిరి శిఖరంలో ఉద్భవించిన కావేరీ నది "తిరుముఖకూటల్" దారిగా ప్రవహిస్తూ నర్సిపూర్‌లోని కపిలనదితో అంతర్వాహినిగా కొండలోయల మధ్య మనకు కనుపించని స్థలంలో ఉన్న స్ఫటికా సరోవరంలో కలసి త్రివేణీ సంగమం అవుతుంది. అక్కడ నుంచి తూర్పుగా తిరిగి శివసముద్రంలో ప్రవహిస్తుంది. అంటే తిరుమగట్టూరూ శివసముద్రాలకు ప్రదక్షణంగా వస్తుందన్నమాట కావేరీనది. శివసముద్రంతో రెండు మూడు దేవాలయాలు ఉన్నాయి. అందులో ముఖ్యమయినది రంగనాథస్వామి ఆలయం. శ్రీరంగపట్నం ఆదిరంగం అయితే ఈ శివసముద్రం మధ్యరంగం అవబడుతుంది.

ఆ కావేరీనది తీరంలో ఉన్న పుణ్యస్థలాలను పంచదశప్రయాగ అంటారు. ఈ స్థలాల్లో కల్లా ప్రశస్తమైనది "నకకాడు" అనబడే గజారణ్యం. ఈ అరణ్యంలో టేకు, చందనం, కాఫీ బాగా పెరుగుతాయి. వాణ్యమైన ఏనుగులకు కూడ ఈ అరణ్యం చాల ప్రసిద్ధిగాంచినది.

— గుళ్ళపల్లి సుందరమ్మ ★

## జీవన్మృతులు

కూర్చునివున్నాడు. చాలా అసంతృప్తిగా కనిపించాడు. వీలయినంత సరదాగా, గౌరవంగా అతనితో మాట్లాడాను. దానికి జవాబివ్వలేదు. "నేను తెలియదా ?" అని అడిగాను. జవాబు చాలా పెడసరంగా వుంది. "నువ్వెందుకు తెలియదు? నువ్వేగా ముసలివెధవ వాన్‌హెల్సింగ్‌వి. నువ్వూ నీ బొంద సిద్ధాంతాలు. డచ్ వాళ్ళు పట్టి మొద్దు తలకాయలు" అన్నాడు. అతను అంతకంటే ఎక్కువ మాట్లాడలేదు. నేనసలు గదిలో వున్నట్టుగానే ప్రవర్తించలేదు. అతని దగ్గర ఎంతో నేర్చుకుందామని వెళితే, ఆ అవకాశం లేకుండా పోయింది. ఇక వెళతాను. మేడమ్ మినా దగ్గరకెళ్ళి కాసేపు సరదాగా కబుర్లు చెపుతాను. మిత్రమా జాన్, ఆమెకుమాత్రం ఈ విషయాలు తెలియజేడానికి వీల్లేదు. ఆవిడ సహాయం మనకు లేకపోయినా ఫర్వాలేదు, ఆమెను ఈ రొంపిలో దింపకూడదు."

"మీరు చెప్పింది తప్పకుండా ఒప్పుకుంటాను" అన్నాను ఎంతో నమ్మకంగా. "ఇది మగాళ్ళు తల దూర్చాల్సిన పని. ఆడవాళ్ళకు మంచిదికాదు. అలాగే చేద్దాం" అన్నాను.

వాన్‌హెల్సింగ్, మేడమ్ మినాతో కాసేపు మాట్లాడటానికి వెళ్ళాడు. ఆర్థర్, క్విన్సీమోరిస్ ఇద్దరూ కనపడని పెట్టెలను ఆమాకి తీయటానికి వెళ్ళారు. ఒకసారి పేషంట్లను చూడాలి. రాత్రికి మేం అంతా కలుస్తాం.

**మినా డైరీ :**

అక్టోబర్, 1 : ఇవాళ నాకేమి చెప్పకుండా నన్ను దూరంగా వుంచటం ఆశ్చర్యంగా వుంది. జోనాథన్ ఎన్నో సంవత్సరాలుగా ఎరుగుదును. అటువంటి జోనాథన్ కొన్నివిషయాలు చెప్పకుండా దాస్తున్నాడు. రాత్రి ఎంతో ఆలస్యంగా వచ్చినా..నాకంటే ముందరే లేచి, నాతో మామూలుగా మాట్లాడి వెళ్ళిపోయాడు. రాత్రి ఏం జరిగిందో అసలు చెప్పలేదు. డ్రాకులా ఇంటిలో ఏదో జరిగివుండాలికదా. అది తెలుసుకోవాలన్న ఆతృత నాకు వుందికదా. అయినా చెప్పకుండా వెళ్ళిపోయాడు. నేను భయపడతానని ఆ విషయాలు చెప్పివుండరు. నా భర్త జోనాథన్‌కూడా నాకు చెప్పకుండా దాస్తున్నాడంటే, నాకు చాలా బాధగా వుంది. కానీ ఇదంతా నా భర్త నేనంటే ఎంతో ప్రేమతో చేస్తున్నాడు. వాళ్ళు కూడా నా మంచిగురించి ఆలోచించి చేస్తున్నారు.

కొన్ని రోజులతర్వాత జోనాథన్ అన్నీ చెప్తాడు. దానిగురించి ఎక్కువ ఆలోచించనక్కర్లేదు. అయినా నా డైరీ నేను రాయటం మానను. నా మనసులో వున్నవన్నీ కాగితంమీద పెడతాను. ఇవాళ ఏమిటో మనసు అంతగా బాగుండలేదు. బహుశా రాత్రి జరిగిన సంఘటనవల్లనుకుంటా...

(ఇంకా వుంది)

# ముగింపు మారని కథ!

ఆదూరి సావిత్రి

గోదావరి గోవు పాదాల రేవుకు దూరంగా ఇసక మేటలు వేసినచోట కూర్చుని ఉన్నదో యువ జంట. చల్లగాలికి ఆమె పైటచెంగు ఎగిరి అతని ముఖాన్ని బుజాల్ని మృదువుగా తాకుతోంది...

''చెప్పు వారిజా... పిక్నిక్‌కి నువ్వు రావా? నిజంగా!'' అన్నాడు శ్రీకాంత్.

అతని ముఖంలో ఆశాభంగం... ఆమెను ఒప్పించాలనే తాపత్రయం పోటీపడుతున్నాయి.

''రాను.'' ఖచ్చితంగా అన్నది వారిజ.

''అదే... ఎందుకు?''

''మామూలు పిక్నిక్ లాగా కాక... ఇది మనిద్దరికే ఉద్దేశింప బడింది గనుక... ఐమీన్... దీన్ని మనిద్దరికే ప్రత్యేకంగా నువ్వు ఎరేంజ్ చేసింది గనుక...''

''నామీద నమ్మకం లేదా నీకు?''

''ఇది నిజంగా పిచ్చి ప్రశ్న. యవ్వనంలో ఉన్నాం ఇద్దరం. ఏకాంతం... పరిసరాలు... వయసు... వోహ్! వీటి మధ్య వ్యక్తి నమ్మకాని కసలు ప్రాధాన్యత ఉండదు ...''

''నువ్వు చాలా కఠినురాలివి.'' కష్టంగా అన్నాడు శ్రీకాంత్.

సన్నిహితంగా నవ్విందామె.

''నీకు నవ్వులాటగానే ఉంటుంది...''

అతని ఉక్రోషం చూస్తుంటే నిజంగా నవ్వొస్తోందామెకు...

అలిగినట్లుగా ముఖం తిప్పుకున్నాడతను.

ఆమె పైటచెంగు చక్కిలిగింతలకు చలించని వాడిలా బిగుసుకున్నట్లు కూర్చున్నాడు.

''యూ నో కాంతూ... నా చిన్నప్పుడే... నాకెవరితోనో పెళ్ళయిందట!'' అసందర్భంగా అన్నది వారిజ.

ఆ సమయంలో ఆ మాట అతనికి చెప్పటం ఇష్టంలేనట్లూ... అయినా తప్పదన్నట్లు ద్వైదీ భావంగా ఉన్నదీమె ముఖం.

''నువ్విలాంటి దారుణమైన జోక్‌లుకూడా వెయ్యగలవా!?''

''ఇది చూడు.'' జాకెట్‌లోనుంచి తళతళా మెరుస్తున్న మాంగల్యాన్ని ఇవతలికి లాగిందామె.

''నువ్వు అనుమతిస్తే... దీన్ని తీసేద్దామను కుంటున్నాను.''

తేలికగా అనటానికి ప్రయత్నిస్తోంది వారిజ.

అదిరిపడ్డాడు శ్రీకాంత్.

అతని కళ్ళు కోపంగా... రోషంగా... అనుమానంగా చూశాయామెను.

కాస్త తడబడి సర్దుకుంది వారిజ.

''నాకు చిన్నప్పుడే పెళ్లయిందట... నా భర్త పారిపోయాట్ట. ఈ రోజువరకూ అతని ఎడ్రస్ లేదు. నా భర్త ముఖంకూడా నేను సరిగ్గా చూడలేదు...''

ఇప్పుడు చెప్పు. నేను పెళ్లయినదాన్నా... కానిదాన్నా? మా ఊరికి ఒక గ్రామదేవత ఉన్నది. ఆమెగురించి — ఒక విచిత్రమైన కథ ప్రచారంలో ఉండేది.

ఆవిడకు ఆమె భర్త మంగళసూత్రం కడుతూ, ఒక్క ముడివేశాక, మిగిలిన రెండు ముళ్ళూ వెయ్యకుండానే చచ్చిపోయాట్ట...

ఇంక అక్కడనుంచీ చర్చ...

ఆమె వితంతువా... పునిస్త్రీయా?

మొత్తానికి రెండూకాదు అని ప్రజలు తేల్చేసే సరికి... అంతటి గ్రామదేవతే ''ఈ సమాజంలో నాకెలాంటి ముద్రపడింది! నిజంగా ఈ ప్రజల తెలివితేటలూ, ఆలోచనా పటిమ ఇంతటివా!'' అనే ఆశ్చర్యంతో ముక్కుమీద వేలేసుకుందిట!

ఆ వేలు తీసే అవసరం ఆమెకు ఇప్పటికీ రాలేదట. ఎప్పటికైనా వస్తుందా అనేది సందేహమే.

చిన్నప్పుడు, తెలిసీ తెలియని వయసులో ఆ కథ వెరీ ఇంట్రెస్టింగ్‌గా ఉండి మళ్ళీ మళ్ళీ చెప్పించుకునేవాళ్ళం.

కానీ ఇప్పుడు నాకా ఇంట్రెస్టు లేదు. ఎందుకో తెలుసా? కాస్త తేడాలో నాదీ అలాంటి కథేగనక.

నీకు పెళ్ళయినట్లా, కానట్లా?

నేనుమాత్రం కాలేదనే అనుకుంటున్నాను.

''పెళ్ళయిన దానివి నాకింత దగ్గరగా ఎలా వచ్చావు?'' అని.

నువ్వడగబోయే ప్రశ్నకు నా జవాబిది.

''నీ నిర్ణయం చెప్పింక'' అన్నది వారిజ.

''ఏ విషయంలో?'' తాపీగా అడిగాడు శ్రీకాంత్.

''మన పెళ్ళి విషయంలో.''

''సారీ వారిజా! మా వాళ్ళొప్పుకోరు. మాది శుద్ధశ్రోత్రియ కుటుంబం...''

''ఇలా అమ్మాయిలతో స్నేహంచేస్తూ... పిక్నిక్ ప్రోగ్రాంలు వేస్తూ ఎంజాయి చేసేటప్పుడు నీకా కుటుంబ పద్ధతులూ ఆచారాలూ గుర్తులేవా? లేక...మీ పద్ధతుల్లో ఇదీ ఒకటా?''

శ్రీకాంత్ ముఖం ఎర్రబడింది.

''నువ్వు నావేపునుంచి ఆలోచించు కాంతూ. నేనతన్ని... అదే నా భర్త అనబడే వ్యక్తిని ఊహ తెలిశాక కంటితో కూడా చూడలేదు. అయినా...నేను పెళ్ళికి అనర్హురాలినేనా?'' అంటుంటే వారిజ కంఠం ఒణికింది.

''ఏది ఏమయినా...ఒకసారి పెళ్ళయిన ఆడదాన్ని కోడలుగా మా వాళ్ళు అంగీకరించరు వారిజా. అందులో నేను పెద్దకొడుకును. సహజంగా ప్రథమ సంతానంమీద, అతనికి పుట్టబోయే పిల్లలమీద కూడా పెద్దవాళ్ళకు కొన్ని ఆశలుంటాయి.''

''సరే పోన్లే! ఇలా అడిగి బాధ పెట్టటం నాదే తప్పు. అనవసరంగా నిన్నెందుకు రిస్కు తీసుకోమనాలి. బైదిబై... పిక్నిక్ అన్నావుగా... వెడదామా?''

అతని కళ్ళలోకి కాంతి ఎగిరి వచ్చింది.

అతని పురుషత్వం ఆమె స్త్రీత్వాన్ని కాంక్షగా.. ఆశగా— చూసింది. రేపు పిక్నిక్‌లో తామిద్దరే.. అందరికీ దూరంగా... ఓహ్!

''రేపు ఉదయం ఆరుగంటలకల్లా నువ్వు రెడీగా ఉంటే'' ఉత్సాహంగా అంటున్నాడు శ్రీకాంత్.

ప్రగతిపథంలో స్త్రీపట్ల పురుషుని ప్రవర్తన ఇదీ! తరం మారిందట! స్త్రీని లొంగదీసుకోటంలో పురుషుని పద్ధతులు మారి ఉండొచ్చు. కానీ... ఆమెకు చేయూత నివ్వటంలో, బాసటగా నిలవటంలో... తల్లిదండ్రులనడ్డం పెట్టుకునే ఆ ఎస్కేపింగ్ తత్వం మారలేదు.

విరక్తిగా నవ్వింది వారిజ.

''సారీ శ్రీకాంత్. నేను రావటం లేదు.'' చర చరా నడిచి వెళ్ళి కారులో కూర్చుని డోర్ బలంగా వేసి, స్టార్ట్ చేసి క్షణంలో కనుమరుగైందామె.

ఒంటరిగా మిగిలిపోయాడు శ్రీకాంత్.

ఈ కారున్న వాళ్లకెంత పొగరు! ఆ డబ్బే లేకపోతే... ఈపాటికి ఏడుస్తూ... ప్రాధేయపడుతూ ఇక్కడే తనతో దేవిరింపుగా కూర్చుండిపోయేది.

ఇప్పుడు? కనీసం తనను డ్రాప్ చెయ్యాలన్న జ్ఞానం కూడా లేకుండా వెళ్ళింది.

ప్యాంటుకంటిన దుమ్ముదులుపుకుని కసిగా అడుగులు వేస్తున్నాడు శ్రీకాంత్.

''అమ్మా ... నాకీ పెళ్లి చేసేటప్పుడు తల్లిగా ఏకేం అనిపించలేదా ? ఎర్రబారిన కళ్లతో తల్లి నడిగింది వారిజ.

శ్రీకాంత్ తిరస్కరించటం ఆ అమ్మాయి తట్టుకోలేకపోతోంది.

''నీకేంతెలుసే..ఇంత దారుణానికొడిగట్టొద్దని మీ నాన్ననెంత ప్రాధేయపడ్డాను! చివరకు నీతో సహా ఆత్మహత్యకు సిద్ధపడ్డాను. కానీ...బల్రపయోగంతో...'' అంటుంటే వర్ధనమ్మ గొంతు పూడి పోయింది.

''ఇప్పుడు మనం అనుభవిస్తున్న ఈ ఆస్తి నీ భర్తది. నీ భర్త పిచ్చివాడు కాదు. అమాయకుడు. మీ నాన్న ఏంచేశారో తెలీదు. పెళ్లవంగానే ఇదంతా నీ పేర పెట్టేసి, అతను ఇల్లు విడిచి పోయాడు. ఆ వెంటనే మీ నాన్న కూడా హార్ట్ ఎటాక్‌తో పోబట్టి ఈ ఆస్తి ఇలా నిలబడింది.'' అన్నది వర్ధనమ్మ.

''ఆహా! ఏం చరిత్రమ్మా మనది! వ్యసనం కోసం భార్యను తాకట్టు పెట్టిన ఓ భర్త! డబ్బు కోసం కూతురి జీవితానికి ఉరిపోసే ఓ తండ్రి ... నాకేమనిపిస్తోందోతెలుసా ? అందరు ఆడ పిల్లల్నీ బ్రతకనివ్వకుండా నన్నింత దగా చేసిన ఈ ఆస్తి నంతా ఏ శరణాలయానికో రాసేసి ...''

''వారిజా, పిచ్చిగా మాట్లాడకు. ఈ ఆస్తే సమాజాన్ని ఆమడదూరంలో నిలబెట్టి, మన మీద రాళ్లు వెయ్యనివ్వకుండా, నేసినా మనని తాకనివ్వకుండా కవచంలా అడ్డుపడుతోంది. నువ్వు కారులో ఉన్నావుగనుక, నేలమీద నడిచే వాడెవడూ నీ గురించి కారుకూతలు కుయ్యడు. నీకీ ప్రపంచం గురించి తెలీదు.

నీకు తండ్రి లేడు, భర్త లేడు. తల్లి ఉన్నా లేనట్లే. ఈ ఆస్తే నీకు రక్షణ. అసలిలాంటి ఆలోచనలెప్పుడూ రానివ్వకు'' మందలింపుగా అన్నది వర్ధనమ్మ.

''నిజంగా నేను పెళ్లికి పనికిరానమ్మా ? ఎవర్నీ మోసం చెయ్యటం నాకిష్టముండదు. నిజం చెపితే ... అంతా నా నుంచి దూరంగా జరిగి పోతున్నారు. పిచ్చివాడు కట్టినా, వెర్రివాడు కట్టినా కూడా ఈ మంగళసూత్రానికింత విలువ వుంటుందా!?''

ఆ ప్రశ్నలకు జవాబిచ్చే శక్తి లేనిదానిలా కళ్ళలో నీళ్ళు నింపుకుని జాలిగాచూసింది వర్ధనమ్మ.

వారిజ కోరుకున్న వ్యక్తిని ఆమె మెడలో ఉన్న మంగళసూత్రం దగ్గరకు రానివ్వలేదు. ఆమెను కోరిన వ్యక్తుల్లో ఆమెకు తన ఆస్తిమీద యావ తప్ప ఇంకేం కనిపించలేదు. పోనీ... సత్యమేవ జయతే అనే సూక్తిని వదిలేద్దామంటే... పెళ్ళయ్యాక ఎలాగో ఈ సంగతి భర్తకు తెలియకుండా పోదు.

ఎందుకు తెలీదు ? తెల్లారే తెలిసిపోతుంది. తన బంధువర్గమంతా చార్జీలు పెట్టుకుని మరీ వచ్చి తన భర్త చెవిలో ఊదిపోతారు.

అప్పుడింతకన్నా నరకం. నన్నెందుకు మోసం చేశావంటూ ఆయన చెండుకుతినటం మొదలెడితే ? ఓహ్! ప్రదహారేళ్ళొచ్చేవరకూ తనకీ ట్రాజెడీ







## ముగింపు వారని కథ

గురించి తెలియకుండా పెంచింది అమ్మ. అందు కోసం ఆమె ఆయినవాళ్ళందర్నీ ఒదులుకుంది.

కానీ... ఒకసారి ఎవరో బంధువులు వెతుక్కుంటూ వచ్చారు తమ ఇంటికి.

"ఏమే వర్ధనీ... ఆ రమణారావుకిచ్చి చేసిన పిల్లేకదూ ఇది? ఎంత ఎదిగిందీ! దీని మొగుడు గురించిన కబురేం తెలీలేదా? వస్తాడులే... వాడు మాత్రం ఎన్నాళ్ళని దేశాలట్టుకు తిరుగుతాడూ?

మా భావగారమ్మాయిలేదూ... రత్న. దాని మొగుడూ ఇలాగే పారిపోయాడుగా. పధ్నాలుగేళ్ళ తర్వాత మొన్న తిరిగొచ్చాడు. పండగ చేసుకున్నారమకో!

అలాగే దీని మొగుడూ వస్తాడెప్పుడో.

ఇంకా నయం! ఆ రత్న ముండకింకొక పెళ్ళి చేశారుకాదు వాళ్ళు! ఎంత అప్రతిష్ఠ! అసలీ రెండేసి పెళ్ళిళ్ళ వ్యవహారం మన వంశాల్లోలేదు...

అన్నట్లు... మంగళసూత్రమేదీ దీనిమెళ్ళో!? తీసి దాచావా? అలా తీసెయ్యకు. వాడికి జయం కాదు. పెళ్ళాం మెళ్ళో మంగళసూత్రమే మగాణ్ణి కాపాడుతుందంటారు." అమ్మ పొరజ్జలను, వారింపులనూ లెక్కచెయ్యకుండా — ఏకధాటిగా వాగేసిందావిడ.

జాగర్త! నీ కూతురికింకో పెళ్ళిచెయ్యకు అనే శాసింపు—తనకోసారి పెళ్ళయిందనే సంగతి వారిజకి తెలియజెయ్యాలనే తహతహ ఆవిడ గొంతులో స్పష్టంగా కనిపించాయి.

శిలలా నిలబడింది తల్లి.

తనచేత అడిగించుకోకుండానే చాలా వరకూ చెప్పేసి, మంగళ సూత్రాలు చూపించింది.

తల్లిదండ్రుల్లో ఏ ఒక్కరి చరిత్ర సరైనది కాకపోయినా... స్థిరత్వం లేకుండా స్వార్థంతో ప్రవర్తించినా... వాళ్ళ పిల్లల జీవితాలు... ముఖ్యంగా ఆడపిల్లల జీవితాలు — ప్రశ్నార్థకాలుగా మిగిలిపోతాయి.

ఈ నిజం వాళ్ళకెందుకు తెలీదు?!

"ఎప్పుడూ దీని గురించే ఆలోచించి మనసు పాడుచేసుకోకు. ఉదయం, సాయంత్రం సావిత్రీ జపం చేసుకో..." అంటుంది వర్ధనమ్మ

"నువ్వెంత పిచ్చిదానివి! ఇన్నాళ్ళా వదలకుండా నువ్వు చేస్తున్న జపం నీకేమాత్రం మనశ్శాంతి నిస్తోంది? నువ్వు నమ్మిన ఆ దేముడు మనకేందారి చూపిస్తున్నాడు? ఎందుకొచ్చిన నమ్మకాలమ్మా ఇవి." విరక్తిగా అన్నది వారిజ.

రానురానూ ఈ దిగులుతోనే మంచాన పట్టి, చివరకు ఆ దిగులుకు శాశ్వతంగా దూరమైంది వర్ధనమ్మ. ఎంతోమంది బంధువులు వారిజమీద సానుభూతి కురిపిస్తూ ఆమెకు అండగా తాము వచ్చి ఆమె యింట్లో ఉంటామని, లేదా... ఆమెనే వచ్చి తమ యింట్లో ఉండమని ఒత్తిడి చేశారు.

ఈ రెంటికీ ఇష్టపడని వారిజని "ఇక్కడ దానికేం మగ వాసనలున్నాయో, మనల్నెందుకు చేరదీస్తుందీ? అచ్చోసిన ఆంబోతులా... ఇక

దానిష్టం..." అంటూ తాటికలు విరిచింది బంధు వర్గం.

* * *

ఒంట్లో బాగుండకపోతే డాక్టర్ జగన్ హాస్పిటల్ కెళ్ళింది వారిజ. అది టైఫాయిడ్‌లోకి దిగింది.

తను ఇంటికొచ్చి వైద్యం చేస్తానన్నాడు జగన్.

పద్దెనిమిది లంఖణాలు చేసింది.

"ఈరోజు మీకు మా ఇంటినుంచి భోజనం పంపిస్తాను" అన్నాడు జగన్.

"ఎందుకు? హోటల్‌నుంచి తెప్పించుకుంటాను" మొహమాటంగా అన్నది వారిజ.

అతను వినలేదు.

జగన్ భార్య వాణి వచ్చి స్వయంగా అన్నం తినిపించిందారోజు వారిజకి.

వాణి వారిజని చెల్లీ అని, వాణి పిల్లలు పిన్నీ అని పిలుస్తుంటే...తను కూడా ఆ కుటుంబానికి చెందిన దానిలా అనిపించింది వారిజకి.

* * *

"వారిజా—పడుకున్నావేం? ఒంట్లో బాగోలేదా మళ్ళీ." ఆమె చెయ్యి పట్టిచూస్తూ అన్నాడు జగన్. "కాస్త ఫీవరొచ్చింది" అన్నాడు.

"కాఫీ తెస్తాను" అంటూ లేవబోయింది వారిజ.

"నాకు కాఫీ కలపటం వచ్చునుకుంటాను. చూడు" అంటూ తనే వెళ్ళి కాఫీ కలిపితెచ్చాడు.

ఆ చొరవ, అభిమానం ఆమె మనస్సును మెత్తగా తాకాయి.

ఆమె కదలికలు జాగ్రత్తగా పరికిస్తున్నాడతను.

శేష ప్రశ్నలాఉన్న ఆమె జీవితానికి తను జవాబు చెపుతానన్నాడు జగన్.

ఒద్దు ఒద్దంటూనే అతనికి లొంగిపోయింది వారిజ.

పెళ్ళి చేసుకోనన్నారని అనేకమందిని తను దూరంగా తోసేసింది. చూసి చూసి పెళ్ళయిన వాడికి తనను అర్పించుకుంది.

ఒంటరితనం ... వయసు ... తన భవిష్యత్తేమిటనే దిగులు తనను బేలగా ... నిస్సహాయంగా చేసి ... ఒక్కరవ్వ అభిమానానికే దాసోహం అనిపించాయి.

తడిగా ఉన్న వారిజ కళ్ళవేపు ఆర్ద్రంగా చూస్తూ "పెళ్ళికి మంగళసూత్రమే ప్రధానం కాదు వారిజా! అది రెండు మనసుల కలయిక. నువ్విప్పుడు నా భార్యవు" అన్నాడు జగన్ మొగలాయి చక్రవర్తిలా.

తెలిసో తెలియకో జరిగిందిది. తన జీవితంలోకి చొచ్చుకొచ్చిన తొలి పురుషుడు. అతనే తన భర్త అనుకుంది వారిజ మనస్ఫూర్తిగా.

వాణి మాత్రం వాసవితో మామూలుగానే ప్రవర్తించటంతో తేలికగా ఊపిరి పీల్చుకుందామె.

సంవత్సరాలు గడుస్తున్నాయి తేలికగా....

ప్రతిరోజూ వాసవి దగ్గరకు వచ్చిగ్గానే వస్తుంటాడు — జగన్. వారానికి రెండుసార్లు ... ఒకసారి జగన్ ఇంట్లోనూ, ఇంకోసారి వారిజ ఇంట్లోనూ వాణి, పిల్లలు — జగన్‌తోపాటు తమూ కలిసిపోతుంది వారిజ. ఈ ఏర్పాటు, ప్రోత్సాహం వాణివేపు నుంచే ఎక్కువగా ఉంటుంది. అలాంటప్పుడు అటు వాణితోనూ, ఇటు వారిజతోనూ కూడా అతిగా ప్రవర్తించడతను.

ఒక్కోసారి తనకు పిల్లలు కావాలనిపించేది వారిజకి. కానీ ... జగన్ తనకా పిల్లలు చాలని ఎప్పుడో ఫుల్‌స్టాప్ పెట్టేసుకున్నాడు.

## కంప్యూటర్ల ప్రభావం!

మర మనుషులను, కంప్యూటర్లను ఉపయోగించటం వలన విద్యుత్ పరిశ్రమలో ఉద్యోగావకాశాలు తగ్గుతున్నట్లు జపాను కార్మికులు తెలియచేశారు. కంప్యూటర్ల ప్రభావం స్త్రీలు, వృద్ధులపై ఎక్కువగా ఉన్నట్లు తెలుస్తున్నది. జపానులో విద్యుత్ యంత్ర కార్మికసంఘం ఇటీవల ఒక సర్వే జరిపింది. కంప్యూటర్లుగల సెక్షన్లలో ఉద్యోగులసంఖ్య తగ్గుతున్నట్లు 57 శాతం మంది తెలియచేశారు. వీటిల్లో ఎక్కువపనిని మధ్య వయస్కులే నిర్వహిస్తున్నారు. 50 సంవత్సరాల పైబడినవారు ఈ సెక్షన్లలో ఉండటం లేదు. స్త్రీలు కూడా దాదాపుగా ఎవరూలేరని ఈ సర్వేలో తేలింది.

జగన్ పిల్లలు తన —పిల్లలుకారూ? అనుకుంటూ వాళ్ళమీద ఎంతో మమకారాన్ని పెంచుకునేది వారిజ.

అతని ఆఖరు కొడుకు ఆరేళ్ళవాడు మధు.

వాడంటే ఆమెకు చచ్చేంత ఇష్టం. వీలైనంత ఎక్కువగా తన దగ్గర ఉంచుకునేది.

* * *

"ఎందుకలా ఉన్నారు?" అన్నం పెట్టబోతూ అడిగింది వారిజ.

"ఎలా ఉన్నాను? అన్నం పెట్టకు. ఆకలిగా లేదు" బలవంతంగా నవ్వాడు జగన్.

"ఏమయింది?" అతని జుట్టులోకి వేళ్ళు పోనిచ్చి లాలనగా అడిగిందామె.

"పెద్దమ్మాయి సుందరికి ఏ సంబంధం కుదరటల్లేదు... నువ్వుచూస్తున్నావుగా! అదసలే వయసుకు మించి ఎదుగుతోంది... చదువూ అబ్బలేదు. దీనికి తోడు అమాయకురాలు. పెళ్ళి చేసెయ్యమని రోజూ వాణి పోరుతోంది.."

ఔను! క్రితం రోజు వాణి తన దగ్గర ఈ విషయం చెప్పి ఏడిచింది. "వారిజా! నువ్వు నా చెల్లెలు లాంటిదానివి. నీతో పంచుకుంటే ఈ బాధ కాస్తయినా తగ్గుతుందని..." అంటూ కళ్ళు తుడుచుకున్న వాణి గుర్తొచ్చింది వారిజకి.

ఈ రోజు జగన్...

చకచకా ఒక నిర్ణయానికొచ్చేసిందామె.

"డబ్బు కోసం కోతికైనా తాళికట్టటానికి సిద్ధపడే ప్రబుద్ధులున్న వీరగడ్డ మనది. మీరు బాధపడకండి. ఒక యాభైవేలు మనవి కావనుకుంటే సుందరి పెళ్ళి ఈజీగా జరిగిపోతుంది." అన్నది వారిజ. "నీకేం! యాభైవేలని అతి తేలిగ్గా తీసెయ్యగలవు..." నిస్పృహగా అన్నాడు జగన్.

"ఇది మరీ బాగుంది. నా డబ్బు మీది కాదా... సుందరి నాకు మాత్రం కూతురుకాదా..." అంటూ యాభైవేలకు నీళ్ళొదిలేసింది వారిజ.

విచిత్రంగా... సుందరి పెళ్ళికొచ్చిన జనమంతా వారిజని అపురూపంగా చూశారు. అదంతా వాణి ప్రతిభ. వాణి సరేసరి...

వారిజ అనుమతిలేనిదే ఊపిరికూడా పీల్చుకోలేనట్లు ప్రవర్తించింది...

ఈ అనుబంధాలు వారిజకి చాలా థ్రిల్లింగ్‌గా అనిపించేవి. కొన్ని తేడాలో ఇదే విధంగా జగన్ ముగ్గురాడ పిల్లల పెళ్ళిళ్ళు జరిగిపోయాయి. అతని పెద్దకొడుక్కి మెడిసిన్ పూర్తయింది...

వాళ్ళంతా జీవితంలో స్థిరపడ్డారు.

వారిజ బ్యాంకు బ్యాలెన్సు జగన్ చేతుల్లోకి వెళ్ళిపోయింది...

క్రమంగా వాణిలోనూ పిల్లల్లోనూ మార్పు రాసాగింది.

వారిజ డబ్బుతోపాటు, ఆమె వయసు, జగన్ ప్రేమ హరించుకుపోసాగాయి.

ఇదివరకంత తరుచుగా రావటం మానేశాడు జగన్. ఏవో సాకులు...

భయంకరమైన ఒంటరితనం, అనారోగ్యం, దిగులు వారిజని తినెయ్యసాగేవి.

జగన్ వస్తే... ఆక్రోశంతో అతని మీద విరుచుకుపడేది. వాణిని విశ్వాస ఘాతకురాలని తిట్టిపోసేది వారిజ. మధుని తనదగ్గరే ఉండమని వేధించేది. పదిహేను రోజులకో నెలకో ఒకసారి ముఖం చూపించే జగన్‌ను పట్టుకుని ఛడా మడా తిట్టి, అంతకు రెట్టింపుగా అతనిచేత తిట్టించుకుని, అతను వెళ్ళిపోగానే వలవలా ఏడ్చేది వారిజ.

వాణికీ, తనకీ భేదమేమిటి ?

నిజానికి ఆమె కంటే తనే ఎక్కువ ప్రేమించింది జగన్‌ని. తన సర్వస్వం ధారపోసి నిరాధారంగా మిగిలింది ...

## ముగింపు మారని కథ

కానీ ... వయసుతో, అందంతో, ఆస్తితో అవసరం లేకుండానే జగన్ అండదండలూ, అభిమానం వాణికి లభిస్తున్నాయి.

తనను పూర్తిగా దోపిడీ చెయ్యటంలో వాణి సహాయ సహకారాల్ని పుష్కలంగా అందించింది జగన్‌కు.

ఇద్దరూ కలిసి చివరకు తననిలా ...

దగ్గు తెరలా వచ్చి ఉక్కిరి బిక్కిరి చేసింది వారిజని. దక్షిణంవేపు గదిలో కిటికీ పక్కగా ఉన్న మంచం మీద ఒంటరితనంతో పోరాడుతూ పడుకుందామె. మధు కూడా రావటంలేదు. ఏం చెప్పారో ఏమో, అయినా అతనికి తెలీదూ ?

తను వాడికి స్నానం చేయించింది, అన్నం కలిపి పెట్టింది. కథలు చెప్పి నిద్ర పుచ్చింది... శ్రద్ధగా చదివించింది... వాడి అల్లరంతా భరిస్తూ... అడిగిందల్లా ఇస్తూ గారంగా, ప్రాణంగా చూసుకుంది. ఆ మమకారం వాడికి లేదా ?! తనలోని అణువణువునూ తన ఆస్తితో కలిపి కర్పూరంలా చేసి జగన్‌కు హారతిచ్చింది. ఆ స్పందన, మమత అతనికి లేవా ?! వాళ్ళ కుటుంబానికి తను మూలస్తంభంలా నిలిచి, వాళ్ళనొక ఉచ్ఛస్థితికి తెచ్చి... ఈ ప్రయత్నంలో తను చివరికి వెలవెలబోతూ ఒంటిగా మిగిలిపోయింది. తన పిల్లలు చీకూ చింతా లేకుండా హాయిగా కలకలలాడుతూ ఉన్నారని నిశ్చింతగా ఊపిరి తీసుకునేవేళ... తనొక జ్ఞాపకంగా వాణి మనసులోకి రాదా ?!

ఆ కృతజ్ఞత వాణికి లేదా ?!

గుమ్మంలో చప్పుడయితే... మెరుపులా తల తిప్పింది వారిజ.

జగన్‌కాదు...

మధుకాదు...

కనీసం... వాణికూడా కాదు...

ఆమె ఒంటరితనానికి తనైనా తోడువద్దామని లాలనగా చూస్తూ లోనికొస్తున్న చిరుగాలి సవ్వడది. ★

## ఇంటిపేరు వారసత్వం !

పశ్చిమ జర్మనీలో అభ్యుదయ భావాలు గల ఒక యువకుడు వివాహానంతరం భార్య ఇంటిపేరును పెట్టుకున్నాడు. అందరూ అతని ఆదర్శాన్ని మెచ్చుకున్నారు కానీ అతడు దత్తపుత్రుడు. దత్తత తీసుకున్న తల్లిదండ్రులు ఈ మార్పును అంగీకరించలేదు. అతనితో బంధుత్వం తెగతెంపులు చేసుకున్నారు. అతను కోర్టుకు వెళ్ళాడు. కోర్టు వారుకూడా అతడి అభ్యర్థనను అంగీకరించలేదు. ఇంటిపేరు మారితే వారసత్వం మారినట్టేనని కోర్టువారు తీర్పు చెప్పారు !


నేనలా విస్తుపోయి
చూస్తూ వుండిపోయా
SUPER 777
NEW! EXTRA POWER
SUPER 777
WORLD'S NO.1 DETERGENT BAR
Weight when packed 150 gm.net
Max.Price Rs. 1.92 Local Taxes Extra

# షాలాక్షుని డైరీ



## గత జన్మ జ్ఞాపకాలు !

పునర్జన్మ లేదనేవారికి అత్యంత ఆశ్చర్యకరమైన సంభవం వారి నమ్మకాన్ని పుట్టుక పటాపంచలు చేసే సంఘటన ఒకటి మన దేశంలోనే వెలికి వచ్చింది. కాన్పూరుకు చెందిన బేతర్ అనే గ్రామంలో ఓ వడ్రంగి కూతురు మూడున్నర సంవత్సరాల ''మీను'' అనే పసిపిల్ల ఓ రోజు వున్నట్టుండి ''నా భర్త చాలా మంచివాడు. ఆ మాయలాడి వలలోపడి, దాని ప్రోద్బలంతో నన్ను చంపేశాడు. చాలా చక్కని డాక్టరు ఆయన. నా కూతురు ఎలా వున్నదో ఏమో'' అన్నదట. దానికామె తలిదండ్రులు ఆశ్చర్యపోయారట. తన పేరు సుధాసిన్హా అనీ, తాను కాన్పూరులోని డాక్టర్ వినయ్‌కుమార్ సక్సేనా భార్యననీ చెప్పిందట. తన భర్త తనను పీకకు తాడువేసి లాగి, చంపేశాడని చెప్పిందట.

ఇది 1978 అక్టోబరు 24వ తేదీన జరిగిన యదార్థం. డాక్టర్ వినయ్‌కుమార్ సక్సేనా తనవద్ద పనిచేసే నర్సు భగవతీసింగ్ మోజులోపడి, ఆ రోజు తన భార్య సుధాసిన్హాను చంపేశాడుట. సుధాసిన్హాకు, డాక్టర్ సక్సేనాకు 1975 లో వివాహమయి ఓ కూతురు కూడా వున్నది. భగవతీసింగ్ మోజులో పడి 1978 అక్టోబరు 24వ తేదీన తన భార్య సుధాసిన్హాను చంపి ఆమె శవాన్ని ఓ ట్రంకుపెట్టెలో పెట్టి ఆ పెట్టెను గంగానదిలో పడేలా రైలు బ్రిడ్జిమీంద వెళ్ళే రైల్లోంచి నెట్టేశాడట. ఖర్మ పరిపక్వమై అవక ఈ కేసు విచారణలో అతను, ఆ నర్సూ నేరస్తులుగా తేలి యిద్దరికి యావజ్జీవ కారాగార శిక్ష లభించిందట.

మూడున్నర ఏళ్ళ మీనూ యీ వివరాలన్నీ చెప్పి, రైల్లోంచి శవం పెట్టెను ఎక్కడ క్రిందికి తోసేసింది కూడా కచ్చితంగా చూపిందట. సుధాసిన్హా తలిదండ్రులను, ఇల్లును చక్కగా గుర్తించి, ఆమె కత్యంత యిష్టమైన సామాసాను తను అడిగి చేయించుకు తిన్నదట. సుధాసిన్హా తండ్రి చనిపోయిన తన కూతురు తిరిగి జన్మించిందని సంబరపడి, మీనూను తనకు దత్తత యివ్వమంటే మీనూ తండ్రి 'నహీ' అన్నాడట. అందుకు ఆ పిల్ల ఖర్చులు సర్వస్వం తానే భరిస్తానని అందు కంగీకరించమనీ ఆమె తండ్రిని ఒప్పించాడట.

## క్షీణించిపోతున్న రూపాయి !

భారద్దేశంలోని డబ్బుకు విలువ నానాటికి హరించుకుపోతూన్నది. 1960 లో రూపాయకు రూపాయి విలువ. అది 1973 లో 47.62 పైసలుగా దిగి, అంతతో ఆగక 1982 నాటికి సగానికి క్షీణించి, కుదించుకుపోయి 21 . 28 గా తేలిందట. రాను రాను మన రూపాయి తన కొనుగోలు శక్తిని యితర దేశాలతో యింత అన్యాయంగా దిగిపోతూన్నదేమి అని మేధావులు వాపోతున్నారట.

## మౌతార్గన్ వాయించే గజరాజు !

తంజావూరులో మాధవన్ అనే ఓ మావటి తన ఏనుగకు ముద్దుగా రాజరాజన్ అని పేరు పెట్టి దానికి మౌత్ ఆర్గన్ వాయించడం ఎంచక్కా నేర్పాడట. అయిదేండ్ల ఆ రాజరాజన్ తొండంతో మవుతార్గనును పట్టుకుని అరగంటసేపు చక్కగా, శ్రవణానందంగా పాటలు వాయించి చూపరులను శ్రోతలుగా చేసి, ముగ్ధుల్ని చేస్తోందట.

## అమెరికాలో 320 లక్షల బీదలు !

అమెరికాలో బీదవాని స్థితి అనే ఓ నిర్ణయం జీవితానికి కూడా అందని బీదవారివాడు 320 లక్షల మంది వున్నారట. బీదరికంమీద యుద్ధం అనే అమెరికా పనులన్నీ కూడా చివరికి బీదవానిమీద యుద్ధంగా మారిపోతున్నాయట. అమెరికాలోని బీదరికం దినదినాభివృద్ధి జనవాభివృద్ధి చెందుతోందట — సర్వే జనాస్సుఖినోభవన్తు !

## కుడివేపు గుండె !

కేరళకు చెందిన కొట్టాయం అనే వూరిలో కన్య అనే ఓ అయిదేళ్లమ్మాయికి ఒళ్ళు బాగులేక వాళ్ల నాన్న ఆమెను ఆసుపత్రికి తీసుకువెళితే ఆమెను స్టెతస్కోపుతో పరీక్ష చేసిన డాక్టరు ఎగిరి గంతేసి ఆశ్చర్యపోయాట్ట. ఆమె గుండె అందరికి వుండేట్టు ఎడమపక్క లేకుండా కుడిపక్కన వుందట. ఆశ్చర్యంతో పునః పునః పరీక్ష చేసి, కుడిపక్కనే వున్నట్టు నిర్ధారణ చేసుకున్నాడట. రోగానికేదో మందిచ్చి పంపేసి, ఈ విషయం ఆయనో పత్రికాముఖంగా బయట పెట్టారట. ఇపుడా కన్య అనబడే అయిదేళ్ల పిల్ల హాయిగా వున్నదట.

## బతికున్న వాళ్లని చంపె రికార్డులు !

మన రాష్ట్రమూ గొప్పదే అని వో పత్ సంఘటన షద్‌నగరుకు చెందిన చవులపల్లి గ్రామంలో జరిగిందట. ఆ వూరు వాసి 90 ఏళ్ళ తోట జంగయ్య అనే ఆతడు నాలుగు నెలలుగా చేతికందని తన పెన్షను స్థితిగతులు విచారించిడానికా ఆఫీసుకు వెళ్లి వాకబు చేస్తే అక్కడ గుమస్తా అయ్యా మీరింకా బ్రతికే వున్నారా అని విస్తుపోయాడట. ఆనక తేరుకుని అయ్యా మీరు వాళ్ళెల్ల క్రితం చనిపోయినట్టు మా రికార్డులో వున్నది. మీరు వాళ్ళెల్ల నుంచీ బ్రతికే వున్నట్టు మీ గ్రామ సర్పంచ్‌గారి వద్దనుంచి మాకో సర్టిఫికట్టు తెస్తేగాని చచ్చినా మేం మీరు బ్రతికున్న విషయం నమ్మలేము అన్నారట— న్యాయమేకదా ! కంటికి కనుపించే వాటిని నమ్మక, వాటిని ఆధారాల నిరూపణతో నమ్మటమే విజ్ఞానం.

## వచ్చిన వృత్తి !

కర్ణాటక మైసూరుకు చెందిన వాసుపాల్ యం. ఏ. చదివి, దొరికిన వుద్యోగాలు నచ్చక, నచ్చే వుద్యోగం దొరకక, విసిగి, యిహ మార్గాంతరం ఆలోచించి, హాయిగా ఆటోరిక్షా డ్రయివరుగా స్థిరపడిపోయాడట. ఆనక చదువులో వుత్సాహం వల్లను, తన గురువుగారి ప్రోద్బలం వల్లనూ తత్వశాస్త్రంలో రిసర్చి చేసి, పి. హెచ్. డి. పట్టా కూడా సంపాయించుకున్నాడట. ఆలోగా అతనికి విద్యాబోధన (కాలేజి) శాలలో చక్కని వుద్యోగం దొరికిందట. అయినా అతను బ్యాంకులోను తీసుకుని ఆటో కొనుక్కొని, కాలేజి లేని టయిములో ఆటోరిక్షా తోలుతున్నాడట. అది తనకు నచ్చిన వృత్తి అన్నారట !

## పాకిస్తాన్‌లో పత్రికా స్వాతంత్ర్యం !

పాకిస్తాన్‌లో పత్రికా స్వాతంత్ర్యము అదోహ మాదిరిగా వుంటుందంటారు. గత అయిదేళ్ళ ఆ దేశ చరిత్రలో వాక్ స్వాతంత్ర్యము, పత్రికా స్వాతంత్ర్యము అనే వాటిమీద ఆ దేశం చేసిన దాడుల ఫలితంగా 317 పత్రికాధిపతులు చెరసాల పాలయ్యారట. 46 పత్రికా రచయితలకు ఏ పత్రికలలోనూ వుద్యోగం దొరకని పద్ధతిలో శిక్షింపబడ్డారట. 4 పత్రికాధిపతులు చంపబడ్డారట. 99 మంది రచయితలకు కొరడాదెబ్బలు లభించాయట. లోహోరు నుంచి వెలువడే ఆంగ్లపత్రిక ''సన్'' మూయబడ్డదట. ఒక్కసారైనా ప్రభుత్వాగ్రహానికి గురికాని పత్రికగాని, పత్రికా రచయితగానీ ఆ దేశంలో లేరని చెప్పొచ్చుట. 

# హైదరాబాద్ నోట్‌బుక్

## తారకరాముడు తెచ్చిన తెలుగు గంగ!

గాలి, నీరు, నేల మానవజాతికి ప్రకృతి దత్తవరాలు. వాటిని మావని, మీవని పరిమితులేర్పరచుకొని పోట్లాడం మానవతకే అవమానం భారతీయుడు — చరిత్రకు తెలిసిన భారతీయుడు 'గంగే చ యమునే చైవ గోదావరి సరస్వతి, నర్మదే సింధు కావేరి జలేస్మిన్ సన్నిధింకురు —' ఓ గంగా, యమునా, గోదావరీ, సరస్వతి, నర్మదా, సింధూ, కావేరీ నేను పోసుకొనే నీటిలో ఆవహించండి — అని అనుదినం స్నాన సమయంలో ప్రార్థిస్తున్నాడు. నదులన్నీ పవిత్రమైనవి, పాపహరాలు, మనవి అనే భావం వుంటేనేగదా ఈ ప్రార్థనకు అవకాశం. భారతదేశవాసి ఆ సేతు శీతనగం వున్న ఏ పవిత్ర నదినీ, ఏ పవిత్ర క్షేత్రాన్నీతనది, తన సొంతం అనుకోలేదు, యావజ్జాతి సొత్తని, ఆ విధంగా తన దని అనుకున్నాడు తదనుగుణంగానే నిత్య జీవితంలో వాటిని స్మరిస్తున్నాడు అలా కానప్పుడు ఉత్తర భారతీయులు రామేశ్వరానికీ, దక్షిణ భారతీయులు బదరీనారాయణకు యాత్ర చేయడం జరుగదు కనుక నదులన్నీ అందరివీని. ఈ దృష్టితో ఏప్రిల్ 19న ఆంధ్రప్రదేశ్, తమిళనాడు ముఖ్యమంత్రులు మద్రాసుకు మంచినీరు సరఫరాచేసే 'తెలుగు గంగ' పథకంపై సంతకాలు చేయడం చరిత్రాత్మకమైనది ఈ ఒప్పందం ప్రకారం 15 టి ఎం సి (శత కోటి ఘనపుటడుగుల) కృష్ణా జలాలు మద్రాసు నగరానికి సరఫరా అవుతాయి 1977లో మహారాష్ట్ర, కర్నాటక, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాలు చేసుకొన్న ఒప్పందం ప్రకారం, మద్రాసు నగరవాసులకు చెరి ఐదు శతకోటి ఘనపుటడుగుల నీరు సరఫరా చేయాలి దాని ప్రకారమే 'తెలుగు గంగ' పథకం రూపొందింది ఈ పథకంవల్ల మద్రాసు వాసులకు మంచినీరు లభించడమే కాక, కడప, కర్నూలు, చిత్తూరు, నెల్లూరు జిల్లాల్లో ఐదున్నర లక్షల యకరాలకు పైగా నీటిపారుదల సౌకర్యం లభిస్తుంది నీరు వాడుకొనే నిష్పత్తిని బట్టి ఉభయ రాష్ట్రాలు ఖర్చు భరించాలి. ప్రస్తుతం అంచనాలను బట్టి తమిళనాడు భరించవలసింది 220 కోట్లు, ఆంధ్ర ప్రదేశ్ భరించవలసింది 500 కోట్లు. పథకం పూర్తయిన పిదప నిర్వహణ ఖర్చును గూడ ఉభయ రాష్ట్రాలూ భరిస్తాయి నిజానికి ఈ పథకం వయస్సు దాదాపు వంద సంవత్సరాలు అప్పటి మద్రాసు చీఫ్ ఇంజనీరు కర్నల్ ఎని ఈ పథకాన్ని రూపొందించాడు కృష్ణాజలాలను పెన్నకు మళ్ళించి, అక్కడి నుంచి చెంగల్పట్టు, దక్షిణ ఆర్కాటు జిల్లాలకు నీరు తేవాలని ఆయన అనుకున్నాడు కాని అహల్యలాగి రాయై పడివుంది ఇప్పుడు తారకరాముని చేతి చలవతో చైతన్యం కలిగింది ముఖ్యమంత్రి ఈ పథకానికి "తెలుగు గంగ" అని పేరు పెట్టడం సముంజసంగానే వుంది ముఖ్యమంత్రి ఈలాటి ముఖ్యమైన విషయాలను తమతో సంప్రతించ లేదని ప్రతిపక్షాలు విమర్శించడం ఏమంత సమంజసంగా లేదు ప్రస్తుతం కేంద్రంలో అధికారంలో వున్న పార్టీ ఏ విషయంలో ప్రతిపక్షాలతో సంప్రతిస్తున్నది కనుక? అస్సాంలో స్థానికుల సమస్యపై ప్రతిపక్షాలు నెత్తిన నోరు పెట్టుకొని గోల పెట్టినా అధికారపక్షం వింటున్నదా? ఇరుగు పొరుగు దేశాల నుంచి వచ్చిన వారి సంఖ్య ఎక్కువయి స్థానికులు తమ సంఖ్య, బలం తగ్గి, తమ హక్కులకే కాదు, అస్తిత్వానికే భంగం కలుగుతున్నదని మొత్తుకుంటున్నా వినేవారు ఏరీ? కనుక మంచిపని జరుగుతున్నప్పుడు తమనుంచి, తమ పార్టీనుంచి ఈ పని జరుగకపోయిందే అనే దుఃఖం మాని, సమర్థిస్తూ మంచిని కొంచెమైనా పెంచడం మంచిది

## మానవ కల్యాణదర్పణం ఆవిష్కరణ

శ్రీ మంత్రిప్రగడ వేంకటేశ్వరరావు 8( సంవత్సరాల కురువృద్ధు జీవితాన్ని ఆర్యసమా. సిద్ధాంతాలకు అంకితం చేసిన మహనీయుడు ఎం( దినా శుద్ధిచేసి ఆర్యమత దీక్ష ఇచ్చిన సంఘ సంస్కర్త ఇతర మతాలవారు, ఇతర భాషలవారు- తాము అధిక సంఖ్యాకులుగావున్నా — తలఎత్తుకోలే భయపడుతున్నకాలంలో ధైర్యంగామతభాషాప్రచార( చేసిన వీరుడు, గొంతెత్తి పిలపించి వేల మంది: ఆకర్షించిన మధుర గాయకుడు ఆయన దయా నందుని సత్యార్థ ప్రకాశం అనుసరించి మాన. కల్యాణ దర్పణమనే వైదికధర్మ బోధామృతం గేయ రూపంలో రచించారు ఈ రెండు పేర్లతోన సంతృప్తి పడక జ్ఞానాంజనమనే మూడవ పేర కూడ పెట్టారు ఈ గేయ శకానికి పీఠికలో ఆచార్య డాక్టర్ పల్లా దుర్గయ్యగారన్నట్టు గేయ శతకం రచించి ఈ సంప్రదాయానికి ప్రవర్తకుల కూడ అయ్యారు ఈ గేయ శతకం ఆవిష్కర ణోత్సవం ఏప్రిల్ 14న శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయంలో డాక్టర్ అక్కిరాజు రమాపతిరావు అధ్యక్షతన జరిగింది భాషా నిలయం గౌరవ కార్యదర్శి ఎం ఎల్ నరసింహారావు స్వాగతం చెప్పారు. డాక్టర్ రమాపతిరావు తమ అధ్యక్ష ప్రసంగంలో శ్రీ మంత్రిప్రగడవారి గుణగణాలను, దయానందుల సేవను, మానవ కల్యాణ దర్పణం విశిష్టతను తెలిపారు పిదప శ్రీ తిరుమల రామచంద్ర గేయ శతకాన్ని ఆవిష్కరిస్తూ, దయానందులు వేదాలకు ఆదివరకు కర్మకాండ పరంగా వున్న వ్యాఖ్యను మార్చివేసిన మహా పండితుడని, వేదాల ఉద్దేశం (1) మానవునికి నైతికాచరణ సూత్రాలు తెలుపడం, (2) మానవునికి అతని పరిసరాలకు సృష్టికర్తకు గల సంబంధం తెలుపడం, (3) మానవుని బంధనాలకు గల కారణం తెలిపి, ఆ బంధనాలు తొలగే ఉపాయాలు తెలుపడం, (4) మానవునికి ప్రకృతిలోని రహస్యాలను తెలిపి, రహస్య పరిశోధనకు ప్రోత్సహించడం, (5) బంధనాలలో వున్న ఆత్మను సత్యామృతమార్గంలో నడిపించడం అని అన్నారు దయానందునికి వేదాలు ఐహికాముష్మిక జీవశక్తి అని, చైతన్యవంతమైన వాస్తవ జీవిత తత్త్వమని అన్నారు మానవజాతి పరిణామానికి అవసరమైన సకల వాస్తవ జ్ఞానం వేదాలలో వున్నదని దయానందులు నమ్మారు గనుక, కృత్రిమమైన వర్ణాలను ఛేదించి సంఘ సంస్కరణ కావించగలిగారని అన్నారు. పిదప ఆర్యన్ స్టూడియో యజమాని శ్రీ పి. సత్యనారాయణ శ్రీ మంత్రిప్రగడ వారిని పట్టువస్త్రాలతోను, వేయిన్నూటపదారు రూపాయలతోనూ సత్కరించారు. మంత్రిప్రగడ వారు కృతజ్ఞత తెలుపుతూ 86 ఏళ్లయినా మధుర గంభీరంగా వున్న కంఠంలో మానవ కల్యాణ దర్పణంలోని కొన్ని ప్రబోధ గేయాలను పాడారు. శ్రీ అక్కిరాజు జనార్దనరావు కృతజ్ఞతతో ఆవిష్కరణోత్సవం సమాప్తమైంది. ఉత్సవ ప్రారంభంలో శ్రీ మంత్రిప్రగడ రఘునాథ రావు మంత్రిప్రగడ వారు రచించిన ప్రార్థన గీతాలను పాడారు.

పూనా ఆంధ్ర సంఘంవారు ఇటీవల ప్రఖ్యాత వైణిక విద్వాంసుడు పద్మశ్రీ ఈమని శంకరశాస్త్రి వీణావాదన కచేరీ ఏర్పాటు చేశారు ఆ సందర్భంగా శ్రీ శాస్త్రిగారిని సన్మానిస్తున్న సంఘం అధ్యక్షుడు శ్రీ ఎం వి గిరిని చిత్రంలో చూడవచ్చు.



**శ్రీ కంచి స్వామికి ముఖ్యమంత్రి స్వాగతం :**

కర్నాటక రాష్ట్రం నుంచి ఆంధ్రప్రదేశ్‌లో ప్రవేశిస్తున్న కంచి కామకోటి పీఠాధిపతులయిన జగద్గురు శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి ముఖ్య మంత్రి ఆంధ్రప్రదేశ్ సరిహద్దులోని, మహబూబ్ నగర్ జిల్లా కస్తూరిపల్లివద్ద ఏప్రిల్ 20న పూర్ణకుంభంతో స్వాగతమిచ్చారు. శ్రీ కామకోటి పీఠాధిపతిని హైదరాబాద్ నగరానికి రావలసిందిగా ఆహ్వానించారు. శ్రీ కామకోటిస్వామి ముఖ్యమంత్రికి ఒక రుద్రాక్షమాల, ఒక శాలువ బహూకరించారు. ఈ సందర్భంలో ముఖ్యమంత్రి ప్రసంగిస్తూ, మానవుడు పాటి మానవునిలో భగవంతుణ్ని చూడ గలిగితే, భూమిపై నేరాలే వుండవని, ఉత్కృష్టమైన మానవజన్మ యెత్తడం ప్రతి మనిషి అదృష్టంగా భావించాలని, తోటి మానవ సేవలో జన్మను సార్థకం చేసుకోవాలని అన్నారు. ముఖ్య మంత్రి ప్రసంగానికి పెద్దస్వామి ఒక నిమిషం మౌన ప్రార్థనతో సమాధానంగా దీవించారు. పెద్దస్వామి తన యెడల కురిపించిన ఆదరాభి మానాలకు ముఖ్యమంత్రి తన్మయులయ్యారు.

## ఇళ్ల పట్టాలకోసం ప్రదర్శన

ఇళ్ల అద్దెలు నగరాలలో విపరీతంగా పెరుగ తున్నాయి – ముఖ్యంగా జంట నగరాలలో మ విడ్డూరం. రెండు చిన్న గదుల వాటాకు రెండ వందలకు తక్కువ లేదు. హైదరాబాద్ పా నగరంలో పూర్వం పెద్దలు తమ వైభవంకోసం పెద్ద పెద్ద ఇళ్లు కట్టుకున్నారు. వారి వారసుల ఆ వైభవం పోయి పెద్ద సడపాలలను అడ్డుగోడల పెట్టి గదులుచేసి, కిరాయికిస్తున్నారు. పొస్టరుగా దిచ్చగాడిలా ఇతర రాష్ట్రాల పరిస్థితి తెలీకుండ కిరాయిలు వసూలుచేస్తారు. ఈ పరిస్థితిలో నగరం లోని వివిధ ప్రాంతాల దాదాపు నాలుగవేల మంది బడుగు వర్గాలవారు మార్చి 21న రంగారెడ్డి జిల్లా కలెక్టరు కార్యాలయం ముందు ప్రదర్శనలు చేశా రంటే తప్పా? బీదలు ఇళ్ళులేక అగచాట్లు పడు తున్నారని, ఇంటి కిరాయిలు ఇళ్లకప్పులను అంటు తున్నాయని, ప్రభుత్వం తమకు సహాయపడాలని కోరుతూ వారు కలెక్టరుకు విజ్ఞప్తి పత్రం అంద జేశారు. తాను అన్నివిధాల సహాయపడుతానని కలెక్టర్ శ్రీ మురళీధర్ వారికి వాగ్దానంచేశారు.

**ఉద్యోగుల నిరసన :**

దాదాపు 20 వేల మంది ప్రభుత్వోద్యోగులు ఏప్రిల్ 18న గాంధీభవన్ నుంచి సచివాలయానికి ఊరేగింపుగా వెళ్లి సచివాలయం ఎదుట నిరసన ప్రదర్శన జరిపారు. గత ప్రభుత్వం ఆమోదించిన ఎన్. జి. ఓ.ల కోర్కెలను అమలుపరచాలని, ఉద్యోగుల పదవీ విరమణ వయస్సు తగ్గింపు వుత్తరువుల రద్దు చేయాలని, ప్రజలదృష్టిలో ప్రభుత్వోద్యోగులను కించపరచే విధానాన్ని ప్రభుత్వం విడనాడాలని వారు కోరారు. ఈ మేరకు ముఖ్యమంత్రికి విజ్ఞప్తి పత్రం సమర్పించారు. వారి కోర్కెలలో చాలవా... ఆమోదించడం సాధ్యంకాదని ముఖ్యమంత్రి ఉద్యోగుల సంఘాల నాయకులకు స్పష్టంచేశారు.

**ఉపశ్రుతి :**

మన దేశంలో పెక్కు ప్రభుత్వ సంస్థలలోని సైంటిస్టులను గురించి కొన్ని సలహాలు ఇవ్వదల చాను. ప్రకటిస్తారా? – అనడిగారు ఒక పెద్ద మనిషి నన్ను. ఏమా సలహాలు? – అనడిగాను. మన సైంటిస్టులు ఆఫీసుల్లో ఎలాగూ పనిచేయడం లేదు. కొత్తవేమీ కనిపెట్టడంలేదు. జీతమేమో ఇవ్వక తప్పదు? వాళ్లను ఇంట్లోనే విశ్రాంతి తీసుకోమందాం. జీతం ఇంటికి పంపుదాము. ఆఫీసు రాకపోకలకు, ఆఫీసులో ఎయిర్ కండిషన్ మొదల యినవాటికి, ఆఫీసు అద్దె, ఇంకా ఇలాటివెన్నో మిగులుతాయి... ఎలావుంది నా సలహా? – అన్నాడు ఆయన. ఈ విషయం కేంద్ర ప్రభుత్వం ఆలోచిస్తే మంచిది.

— తిరుమల రామచంద్ర ✽


Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-2. Editor: S Radhakrishna.

మధుర స్మృతులు కలిగించే ఆనందం...
రోజంతా నిలిచివుండే తాజాతనం




# పాండ్స్

## డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్

మీరు ఎప్పుడూ వలచే పరిమళము